

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక

సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ **కె.వి.గోవిందరావు** బి.ఏ.,ఎల్.ఎల్.బి

గౌరవ సహాయ సంపాదకులు:

**టి.ఎల్.ఎన్.రావు** బి.ఎస్.సి.,

**వి.బాలకుమార్** ఎమ్.ఏ.,బి.ఎల్.

సహాయకులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి

## చందా వివరాలు

జీవిత చందా ........ రూ.350/-

3 సంవత్సరాల చందా ........ రూ. 85/-

సంవత్సర చందా ........ రూ. 30/-

ఎయిర్ మెయిల్ (1 సం.) ........ రూ.125/-

సీ మెయిల్ (1 సం.) ........ రూ. 70/-

చందా పంపవలసిన చిరునామా

**రత్నా ఏజన్సీస్**

9, దేశికర్ రోడ్ మైలాపూర్, మద్రాస్-600004

ఫోన్: 73327

## ఈ సంచికలో

సెప్టెంబరు 1989



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
ఎస్.శివన్నారాయణ

**తెలుగు విస్డమ్‌కు ఇది ఎనిమిదవ సంవత్సరం**

## ధ్యానం

### నిశ్చలమైన మనస్సుతో భావాలను సరళం చేసుకో




బుద్ధికి చపలత్వం సహజం. క్షణక్షణం తలపులు పుడుతూంటాయి, మారుతూంటాయి. వీటిలో మంచివి కొన్ని ఉంటే చెడ్డవి కొన్ని ఉంటాయి. ఆగ్రహం ఆవహిస్తుంది. దుఃఖం కలుగుతుంది. విచారం పట్టుకుంటుంది. సంశయాలతో తికమకలు పడిపోతావు. అసూయ చెందుతావు. అనుమానం, భయం, ఆశకు ఆకాశమే అవధి. చిత్తం విక్షేపం చెందిపోతుంది. అంతా అయోమయంగా ఉంటుంది. కాని పరిపూర్ణమైన శారీరక ఆరోగ్యాన్ని ఆశిస్తావు. ఇది ఎలా సాధ్యం? అసాధ్యమైన దాని కోసం అపేక్షతో ఎదురుచూస్తావు. ఇప్పటిదాకా ఎడతెగకుండా మానసిక క్షేత్రంలో విష విత్తులను నాటుకుంటూ వచ్చావు.

మంచి చెడ్డలు తెలిసిన వివేక

(మిగతా 3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### ఉత్తమ పౌరుడు

డెమోక్రసీ (ప్రజాస్వామ్యం) అంటే సహకారము. సామూహిక సహకారోద్యమం సాధించే పౌరులు ఉత్తములు కానప్పుడు సహకారధర్మం సఫలమవదు. ఉత్తమశీలురైన పౌరులు లేనిదే ప్రజాస్వామ్యం విజయవంతం కాదు. కాబట్టి ప్రజా స్వామ్యం సార్థకం కావడానికి వ్యక్తిగత శీలం ముఖ్యం. వ్యక్తినుండే ప్రజాస్వామ్యం ఏర్పడుతుంది. పరస్పర సహకారోద్యమంలో ఫలితం పొందడానికి ముందు ప్రతి పౌరుడు ఉత్తమ పౌరుడనిపించుకోవాలి

ఉత్తమపౌరుడు పిరికివాడు కాజాలడు. ఇతరుల తప్పిదాలకు భయపడడు ఇతరులతో తన భావాల మరియు ఆశయాల ఉత్కృష్టతను వాదిస్తాడు. ఇతరుల దోషాలను, తప్పిదాలను విమర్శిస్తూ పోరుకొట్టడు. ఇతడి ప్రపంచం విశాల ప్రపంచం. నాలుగు గోడలమధ్య సంకుచితమైన చీకటికొట్టు కాదు.

మానవుడు హేతువాది అన్న విషయం ఇతడికి తెలుసుకాబట్టి బాధ్యత వహిస్తాడు. తన ప్రత్యేక శక్తి సామర్థ్యాలను ప్రజోపయోగకరంగా వినియోగిస్తాడు. స్వంత లాభానికి ఉపయోగించుకోడు. లేనిపోని వేషాలతో డాంబికతను ప్రదర్శించడు.

పరమసత్యం ఒక్కటే అని వివేకవంతులు వివిధ మార్గాలలో దానిని సాధిస్తారని విశ్వసిస్తాడు. పరమాత్మ స్వరూపమైన

తెల్లనివన్నీ పాలు కావు, మెరిసేదంతా బంగారం కాదు.

అనంత సత్యం ఏ ఒక ప్రత్యేక మతానికి చెందినదికాదు. ప్రతి మతానికి దాని భౌతిక లక్షణాలు వేరైనా కొన్ని ముఖ్య ప్రాతిపదిక ధర్మాలు అన్నిటికి సమానం. వ్యక్తిత్వానికి, గౌరవ మర్యాదలకు ఎంత మాత్రం లోపం లేకుండా సమాజానికి తావీయగలిగినది



ఎప్పుడు ఇవ్వాలో అప్పుడు ఇస్తాడు. తాను చేయవలసిన పని కాలనియమంతో కాలాన్ని అనుసరించి చేస్తాడు. తన అవసరం ఉన్న ఏ అవకాశంలోనైనా పాల్గొంటాడు. ప్రతీ విషయాన్ని విలాసవంతంగా చేబడతాడు.

ఉత్తమ పౌరత్వము మరియు సహకారము ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉంటాయి. ఒకదాని నుండి ఒకటి విడిపోవునవి కాదు. ఉత్తమపౌరులు ఎక్కడ ఉంటారో అక్కడే ఉత్తమ సహకారం ఉంటుంది ఉత్తమ పౌరులు పరస్పర భేదాభిప్రాయాలను సహనంతో, నిష్కాపట్యంగా, సామరస్యమైన చర్చలతో సర్దుబాటు చేసుకుంటారు. సహనము, సర్దుబాటుగుణము, సహకార భావము ఆవశ్యకములని ఉత్తమ పౌరులకు తెలుసు. పౌరులు ఉత్తమ పౌరులు కానప్పుడు దేశంలో ఆంతరంగిక కలహాలు, అశాంతి ఉద్భవించి ప్రబలిపోతుంది.

కాబట్టి మనదేశం సుసంపన్నమైన దేశంగా వర్ధిల్లాలంటే మొట్టమొదట మనం ఉత్తమ పౌరులనిపించుకోవాలి. పరస్పర ద్వేషాలు, వైషమ్యాలు నిర్మూలించుకోవాలి. సానుభూతితో విశ్వాసంతో సహకారభావాన్ని పెంపొందించుకోవాలి.

---

( 2 వ పేజీ తరువాయి)

వంతుడు ఇటువంటి మానసిక ప్రవృత్తులకు తావీయడు. మహాసముద్రంలో లేచే పెద్ద పెద్ద తరంగాలనైనా ఆపవచ్చునేమో గానీ చిత్తవృత్తులను నిగ్రహించుకోలేము. శారీరకంగా, భౌతిక సంబంధమైన బాధలు ఎన్నో ఉండవచ్చు ఇవి లేకుండా చేసుకో. పరిపూర్ణమైన ఆరోగ్యాన్ని అనుభవిస్తావు. అప్పుడు ఆత్మ పరీక్షచేసుకో. భావాలను క్రమపరచుకో సర్వసమన్వయం, సమరసభావం సిద్ధిస్తుంది. భావాలను సరళవంతం చేసుకో. సంతోషకరమైన యోచనలు కలిగించుకో. ప్రేమ భావాలను పెంచుకో. సద్భావం అనే జీవనౌషధం నీ రక్తనాళాలలోకి ఎక్కిపోయినప్పుడు నీకు వేరే మందులు, మాకులు ఎందుకు? దేహానికి ఆరోగ్యం, ప్రాణానికి సుఖం, మనస్సుకు నెమ్మది ఏర్పడుతుంది. ఇదే ముఖ్యం. ఈ మూడు సరళంగా సమకూడినప్పుడు జీవితం చరితార్థమైపోదూ? అసూయ, అనుమానం పోగొట్టుకో. ద్వేషం, వైరం దరిచేరనీయకు. స్వార్థపరత్వాన్ని వదలుకో. ఏ బాదరబందీ ఉండదు. నీ అనారోగ్యం అంతర్థానమైపోతుంది. రోగాలు వాటంతట అవే మాయమైపోతాయి. మూర్తీభవించిన ఆరోగ్యం నీవే అవుతావు

**పారన భగవంతుణి మార్చదు, మనల్నే మారుస్తుంది.**

# సింగపూరు

మలేసియా ద్వీపకల్పం చిట్టచివర భూమధ్య రేఖకు 1° ఉత్తరాన ఉన్న సింగపూరు నేక ఉత్సవాలతో వివిధ సాంప్రదాయాలతో నిత్యం దేదీప్యమానంగా కళకళలాడుతూ ండే ద్వీపము. ఇది ఒక ఉష్ణ ప్రదేశము.




పూర్వం దీనిని టెమసెక్ (Temasek) అని పిలిచేవారు. అనాడు అది ఒక చేపలు పట్టే ద్వీపంగా ప్రసిద్ధి పొందింది. తరువాత 14 వ శతాబ్దంలో శ్రీ విజయన్ అనే రాజు ఇక్కడ ఒక సింహాన్ని చూచి దానికి సింగపుర అని పేరు పెట్టారు. అదే సింహ నగరము (Lion City).

ఆధునిక సింగపూరును కనిపెట్టిన ఘనుడు సర్ స్టామ్‌ఫర్డ్ రాఫెల్స్. ఈ ద్వీపాన్ని పాలించే మలయా రాజులతో 1819 లో సంధిచేసుకుని అతడు ఇక్కడ బ్రిటిష్ వలసలను స్థిరంగా ఏర్పరచి వ్యాపార కేంద్రాన్ని నెలకొల్పాడు ప్రాక్పశ్చిమాలకు సింగపూరు ఒక గొప్ప వ్యాపార కేంద్రంగా ఏర్పరచాడు. ఇది బ్రిటిషు సైనిక దళాలకు ముఖ్యకేంద్రంగా ఏర్పడింది. అకస్మాత్తుగా 1942 లో జపాను ఆక్రమణవల్ల తాత్కాలికంగా దాని పెరుగుదలకు అంతరాయం ఏర్పడింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత క్రౌన్ కాలనీగా ఉన్న సింగపూర్‌కి 1955 లో సెల్ఫ్ గవర్నమెంటు ఏర్పడింది. రెండు సంవత్సరాలు మలేసియా ఫెడరేషన్‌లో ఉన్న తరువాత 1965 లో ఇండిపెండెంట్ రిపబ్లిక్‌గా ఆవిర్భవించింది.


Sir Stamford Raffles

ఈనాడు సింగపూరు ప్రపంచంలో మిక్కిలి రద్దీగా ఉండే పెద్ద రేవు పట్టణము. సింగపూర్ రేవులో 600 ఓడలు ఎప్పుడూ లంగరు వేయబడి ఉంటాయి. అధునాతనమైన రాకపోకల సౌకర్యాలు, విశాలమైన మరియు పరిశుభ్రమైన వీధులు, నవ్యాతి నవ్య విధానంలో ఆకాశ హర్మ్యాలు రాఫెల్స్‌నే ఆశ్చర్య చకితుడిగా చేసేస్తాయి.

1878 మరియు 1913 సం. ల మధ్య వ్యాపారం 8 రెట్లు పెరిగింది. జీవనోపాధి వివిధ ఉద్యోగావకాశాలు కల్పించే సింగపూరు అనేక మంది విదేశీయులకు ముఖ

“పని ఎవరినీ చంపదు. కానీ చింత అందరినీ చంపుతుంది.

వలస కేంద్రం అయింది. ముఖ్యంగా చైనా, ఇండియా, సిలోన్ (శ్రీలంక) నుంచి అనేకమంది ఇక్కడ చేరారు. ఇప్పుడు సింగపూరు వివిధ జాతులవారికి, అనేక మతాలవారికి ముఖ్య స్థావరమైంది.




76 శాతం చైనీయులు, 15 శాతం మలేసియనులు, 6.4 శాతం భారతీయులు మరియు పాకిస్థానీలు, 2 శాతం ఇతర దేశీయులుతో కూడిన దీని జనాభా 2.5 మిలియను. సింగపూరు భిన్నత్వంలో సామరస్యాన్ని నెలకొల్పి వివిధ మతాలకు చెందినా వారి వారి ప్రార్థనలకు మసీదులు, దేవాలయాలు, చర్చిలు ఒకే చోట ఏర్పరచింది. ఇది అపూర్వమైన సింగపూరు ప్రజల పరస్పర సహన భావాన్ని ప్రతిబింబిస్తూంది.

భాషా విషయకంగా కూడా మాలే, మాండరిన్, తమిళం మరియు ఇంగ్లీషు నాలుగు అధికార భాషలకు సమాన గౌరవం ఉంది. అయినా ఇంగ్లీషు భాష అధికంగా వాడబడుతూంది. 1965 లో సింగపూరు స్వాతంత్ర్య సామ్రాజ్యంగా ఏర్పడిన తరువాత 20 సంవత్సరాల నిర్మాణ కార్యక్రమం సింగపూరు రూపు రేఖలనే బ్రహ్మాండంగా మార్చేసింది. పెద్ద పెద్ద రోడ్లు, నౌకా నిర్మాణం మరియు రిపేరు సౌకర్యాలతో పెద్ద రేవు పట్టణాలు, రిఫైనరీలు, ఆకాశాన్ని అంటే వ్యాపార భవనాలు, లగ్జురీ హోటళ్ళు, షాపింగ్ సెంటర్లు, ఫ్యాక్టరీలు మొదలైనవాటితో చైతన్యవంతంగా ఉంటుంది. అన్ని హంగులతో సౌకర్యాలతో బ్రహ్మాండమైన క్రొత్త ఎయిర్‌పోర్టు నిర్మించబడింది. ముఖ్యనగరమైన సింగపూరు నుంచి చుట్టుపట్ల ఏర్పడిన క్రొత్త పట్టణాలను కలుపుతూ 2.5 బిలియన్ డాలర్ల వ్యయంతో ఏర్పరచిన రైలు సౌకర్యం అత్యంత వేగమైనది.

సింగపూరులో శ్రామికుల జీవన ప్రమాణం అభివృద్ధితో పాటు ప్రగతికరంగా ఉంటుంది. ప్రభుత్వంవారు సెంట్రల్ ప్రావిడెంట్ ఫండ్‌ను ఏర్పాటుచేసారు. ఇది నేషనల్ సోషల్ సెక్యూరిటీ సేవింగ్స్ ప్రోగ్రాంకు సరిసమానంగా ఉంటుంది. ప్రస్తుతం ఇచ్చట శ్రామికులు ఆర్జించిన దాంట్లో 25 శాతం ప్రావిడెంటుఫండుగా నిల్వచేసుకుంటారు. దీనికి మరో 10 శాతం ఉద్యోగాధికారుల కాంట్రిబ్యూషన్ ఉంటుంది. మెంబర్లు ఈ సొమ్ముతో ప్రభుత్వమువారుగానీ, ప్రైవేటు సంస్థలుగానీ,

**ఇంగ్లీషు సంఖ్యావాచక శబ్దంలో 'A' అక్షరం**

ఇంగ్లీసు సంఖ్యావాచక శబ్దంలో 'A' అనే అక్షరం కనిపించాలంటే వెయ్యిదాకా లెక్క పెట్టవలసిందే.

"ఆశ లేనివానికి అగచాట్లు లేవు."

కట్టిన ఇళ్ళను కొనుక్కోవచ్చు. ఇప్పుడు సింగపూరు జనాభాలో 85 శాతం ప్రభుత్వం వారు నిర్మించిన ఫ్లాట్‌లలో నివసిస్తున్నారు. వీరిలో 75 శాతం మందికి స్వంత ఇంటి సౌకర్యం ఉంది.

ఇక్కడి జురోంగ్ బర్డ్ పార్క్ ప్రపంచంలో ఉండే మొత్తం 3000 వివిధ రకాల



SINGAPORE–CITY VIEW

పక్షులకు ఆశ్రయంగా ఉంది. ఇదే ఆసియా దేశపు నాక్టుర్నల్ బర్డ్‌హౌస్. 1500 పక్షులు విచ్చలవిడిగా ఎగురుతూంటాయి. ఇక్కడ కృత్రిమ జలపాతాలు కూడా నిర్మించబడ్డాయి. దీనిని సందర్శించేవారు రోజుకు రెండుసార్లు ప్రత్యేక పక్షుల ప్రదర్శనాన్ని చూచి ఆనందించవచ్చు.

ప్రపంచంలో ఉన్న మొదటి పది జంతు ప్రదర్శనశాలలలో సింగపూరులో జూలాజికల్ గార్డెన్స్ మిక్కిలి ప్రసిద్ధిపొందినది. ప్రకృతి సిద్ధమైన వాతావరణంలో చూచేవారికి జంతువుల మధ్య అడవిలో తిరుగుతూన్నట్లు అనిపిస్తుంది. ఇచ్చట గల బొటానికల్ గార్డెన్స్ అతి రమణీయంగా ఉంటాయి. నేషనల్ మ్యూజియం, దీనికి దగ్గరలోనే ఉన్న ఆర్ట్‌గాలరీ ప్రత్యేకంగా సింగపూరు చరిత్రను చాటుతుంటాయి. ఇక్కడ మ్యూజియంలో అజేడ్ (ఆకుపచ్చని రత్నాలు) ప్రపంచంలో ఉత్తమోత్తమమైనవి.

ఇచ్చట గల సైన్స్ సెక్షన్‌లో జీవశాస్త్రము, భౌతికశాస్త్రము, వైమానిక విజ్ఞానం మిక్కిలి ప్రగతిపూర్వకంగా ఉన్నాయి.

సింగపూర్ హాండీక్రాఫ్ట్ సెంటర్‌లోని 25 షాపులలో వివిధ రకాల ఆభరణాలు లభిస్తాయి.

కేబిల్ కారులో కూర్చుని ప్రపంచంలో మిక్కిలి పెద్దరేవు మీదుగా సెంటోసా ద్వీపానికి వెళ్ళవచ్చు. సుందరమైన బీచ్‌లు, వనాలు గల ఈ ప్రదేశంలో రైలుమీద

## 'విస్డమ్' పాతకాపీలు

ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచి నవంబరు 84'; జనవరి 85, మార్చి '85 నుంచి అక్టోబరు '85; జనవరి '86 నుంచి డిసెంబరు '86; జనవరి '87 నుంచి డిసెంబరు '87; జనవరి '88 నుంచి డిసెంబరు '88 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీవెల పై 0-75; 1984 కాపీల వెల రూ. 8-75 లు; 1985 కాపీల వెల రూ. 11-50 లు; 1986 కాపీల వెల రూ. 18-25 లు; 1987 కాపీల వెల రూ. 19.00 లు; 1988 కాపీల వెల 20.25 లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందదానికి కాపీల వెలతోపాటు రూ. 5-00 లు చేర్చి M. O. పంపాలి. 'విస్డమ్', 9, దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

మేనేజర్

"అక్రమవాదికి అందరూ విరోధులే."

పయాణించేసి 19 వ శతాబ్దపు బ్రిటిషు టను సందర్శించవచ్చు. ఇక్కడే మారి టైమ్ మ్యూజియం, మ్యూజికల్ ఫౌంటెన్, పూర్వ శిలా ప్రదర్శనశాల చూడవచ్చు.

సింగపూరులో వాతావరణం సంవత్సరం పొడవునా వేసవి అనిపిస్తుంది. సింగపూర్ టర్ఫ్ క్లబ్‌లో గుర్రపు పందాలను,




ఇతర మలేసియా పందాలను 40 అడుగుల పెద్ద కలర్ వీడియో స్క్రీనుమీద చూడవచ్చు. ఈ చిన్న ద్వీపంలో గోల్ఫ్ కోర్టులు చాలా ఉన్నాయి. ద్వీపం ఉత్తర దిక్కుగా చివర జోహార్ జలసంధి అత్యంత రమణీయంగా ఉంటుంది.

వివిధ జాతులతో విలసిల్లే సింగపూరులో ప్రపంచంలో మరెక్కడా జరగనన్ని ఉత్సవాలు జరుగుతాయి. ప్రతీ నెలా సంవత్సరం పొడుగునా రోడ్లమీద ఏదో ఉత్సవం జరుగుతూనే ఉంటుంది. మరణించిన వారి ఆత్మశాంతికై హంగ్రి గోస్ట్సు అనే ఉత్సవం నెల రోజులపాటు జరుగుతుంది. గొప్ప దేశభక్తుడైన చు యు వా న్ (Chu yuan) కవి జ్ఞాపకార్థం డ్రాగన్ బోట్ ఫెస్టివల్ జరుపుకుంటారు. ముఖ్యంగా సింగపూరు పరిశుభ్రమైనది. సింగపూరు విరపాయకరమైనది. సింగపూరులో ఉత్తమ రాకపోక సౌకర్యాలు ఉన్నాయి. అందుచేతే అనేకమంది సింగపూరును సందర్శిస్తారు.

మందులు మరియు మత్తుమందుల దొంగ రవాణాకు శిక్ష మరణదండన. ఈ హెచ్చరిక సింగపూరు వచ్చే వారి ప్రతీ ఇమిగ్రేషన్ ఫారం మీద ఉంటుంది.

సింగపూరులో ప్రజల ఆరోగ్యాన్ని గురించి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకుంటుంది. మలేరియా మరియు ఇతర ఉష్ణ ప్రదేశాలలో తరచు వచ్చే రోగాలను పూర్తిగా నశింపచేసారు. 2000 సంవత్సరం నాటికి దీనిని పొగ కాల్పని దేశంగా మార్చడానికి పూనుకున్నారు.

ఒకప్పుడు అంతరించిపోయిన ప్రాచీన సాంప్రదాయాలు, ప్రాచీన కళలకు ఇప్పుడు తిరిగి అభిలాష ఏర్పడుతూంది.

— 'ది లాంప్ & సింగపూర్ టూరిస్ట్ ప్రమోషన్ బోర్డ్' సౌజన్యంతో

## మానవుని మెదడులో 1,(

'లు

మానవుని మెదడు 1,000,000,000,00[illegible] నాడీకణాలతో నిర్మింపబడి ఉంది. ఒక్కొక్క కణాన్ని లెక్కపెట్టడానికి ఒక సెకండు చొప్పున మొత్తం వీటిని లెక్కబెట్టడానికి శతాబ్దాలు పడుతుంది.

"ఆధ్యాత్మికావసరాలు యుక్తివాదముతో తీరవు.

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1. గిర్ అడవులు ఉన్న ప్రదేశము ఏది?

(ఎ) కేరళ, (బి) అస్సాం, (సి) గుజరాత్, (డి) మహారాష్ట్ర.

2. టిబెట్‌లో బ్రహ్మపుత్రా నదిని — అంటారు.

(ఎ) యాంగ్ ట్సే కియాంగ్, (బి) ట్సాంగ్‌పో, (సి) హ్వాంగ్ హో, (డి) టీసా.

3. మహాత్మాగాంధీ ఇక్కడ జన్మించాడు:

(ఎ) అహమ్మదాబాదు, (బి) పోర్‌బందర్, (సి) గాంధీనగర్, (డి) బరోడా.

4. హరిత విప్లవము (Green Revolution) నకు మూలకారకుడు:

(ఎ) నార్మన్ బోర్‌లాగ్, (బి) లూయీ పాశ్చర్, (సి) అలెగ్జాండర్ ఫ్లెమింగ్, (డి) వి.ఎల్. మెహతా.

5. 'కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ ఆఫ్ ఇండియా' అధ్యక్షుడు ఎవరు?

(ఎ) జవహర్‌లాల్ నెహ్రూ, (బి) రాజేంద్రప్రసాద్, (సి) బి ఆర్. అంబేద్కర్, (డి) మహాత్మా గాంధీ.

6. కలకత్తాలో ఉన్న 'నిర్మల్ హృదయ్' ప్రారంభించినది:

(ఎ) మదర్ థెరీసా, (బి) జ్యోతీబాసు, (సి) సరోజ్ ముఖర్జీ, (డి) మృణాల్ సేన్.

7. ఫెయిర్‌ఫాక్స్ డిటెక్టివ్ ఏజెన్సీ ఏ దేశానికి చెందినది:

(ఎ) యు.కె., (బి) ఫ్రాన్స్, (సి)

## ఒర్పిడి వల్ల 600 కోట్ల టన్నుల మన్ను ప్రతి సంవత్సరం కొట్టుకు పోతూంది

భారతదేశంలో ప్రతి సంవత్సరం ఒర పిడివల్ల 600 కోట్ల టన్నుల మన్ను కొ పోతూంది. దీని కారణంగా సాలీనా దా. 60 కోట్ల విలువ ఆహార ధాన్యాల నష్ట ఏర్పడుతూంది. భూమి కొట్టుకుపోవడం, కొ రత అనే రెండు తీవ్ర భయంకర పరిస్థితు ను ఇప్పుడు దేశం ఎదుర్కోవలసివస్తూంది .5 సెం.మీ. మట్టిపొర ఏర్పడడానికి 10 ల 2500 సంవత్సరాలు పట్టినా 1 సంవత్సరాల అల్పకాలంలో ఆ మన కొట్టుకుపోతుంది.

— 'సిఇఇ.ఎన్ఎప్ఎవ్' సౌజన్యం

'కర్మఫల మాశించని నరుని రక్షణ పరమాత్ముని బాధ్యత.

యుఎస్ఎ, (డి) జపాన్.

8. రంగస్వామి కప్ దేనికి సంబంధించి నది?

(ఎ) క్రికెట్, (బి) హాకీ, (సి) లాన్ టెన్నిస్, (డి) చెస్.

## ప

ఒకటి క్షీణించినపుడు మరొకటి వృద్ధి చెందినపుడు నేను దేహము దాల్చి జన్మింతును అన్నాడు కృష్ణుడు. ఆ రెండు ఏవి?

2. 19కి రెండు అంకెలు కలిపి 20 కంటే తక్కువ సంఖ్య చేయగలవా?

3. 'అదువుదేది', 'పుపుపుదుణరురా', 'వందుపుఅతరూ' మాటలలో అక్షరాలు చెల్లాచెదురు అయినాయి. సరిగా వ్రాయండి.

4. తెలుగులో 'ఉత్సాహం', 'కొల్లగొట్టడం' 'వేడుక' అనే పదాలకు ఎక్కువగా వాడుకలో ఉన్న ఉర్దూ పదాలు వ్రాయండి.

5. ఎవరివి వారు తెరుచుకుని తేరిపార చూస్తారు?

6. ఎప్పుడు కుక్క లోపలికి ప్రవేశించడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది?

## మాటల మహిమ

1. విడిముడి: ధనము (ఎ), వీడిన ముడి (బి), వాసస్థానము (సి), బస (డి).

2. విడియు: డబ్బు పెట్టుకునే సంచి (ఎ), కాపురము (బి), తాంబూలము (సి), విడెము (డి).

3. వలిపిరి వానపడేటప్పుడు పీటి తుంపర (ఎ), చలి (బి), కంపము (సి), శ్రమ (డి).

4. తడవు: విమురు (ఎ), వెదకు (బి), సంపాదించు (సి), ఆలస్యము (డి).

5. జాతర: ఉత్సవము (ఎ), అల్లరి (బి), తీర్థయాత్ర (సి), కూతురు (డి)

6. చవి: రుచి (ఎ), వలపు (బి), ఆశ (సి), ప్రియము (డి).

7. ఉప్పిడి: ఉప్పులేనిది (ఎ) ఉపవాసము (బి), కీడు (సి), ఉడకబెట్టిన వడ్ల బియ్యము (డి).

8. అణి: శ్రేష్ఠము (ఎ), అంచు (బి) ఆనవాలు (సి), ఉంత (డి)

(జవాబులకు వ పేజీ చూడండి)

## ప్రపంచంలో అత్యున్నత ప్రదేశంలో ఉన్న ఉప్పునీటి సరస్సు



ఇండో చైనా సరిహద్దులో లడక్ (జమ్ము కాశ్మీర్ రాష్ట్రం) లో పాన్‌గాంగ్ త్సో (Pangong Tso) ప్రపంచంలో 4 300 మీటర్ల కంటే ఎత్తైన అత్యున్నత ప్రదేశంలో ఉండే ఉప్పునీటి సరస్సు. జెమినీ రబ్బరు క్రాఫ్ట్‌ను ఉపయోగించి సదరన్ నావల్ కమాండ్‌కు చెందిన నావీ డైవర్లు విజయవంతంగా ఈ సరస్సులో స్కూబా డైవింగ్ పూర్తి చేసారు.

'వినయతతో కూడినమాటలో, సాయపడు చేతిలో

# 180 మిలియను సంవత్సరాల నుంచి మార్పుచెందని రూపం

ధన్ కర్ కారియా

సజీవమైన నాటిలస్‌ను చాలా తక్కువమంది చూచి ఉంటారు. అనేక యుగాలకు పూర్వం విస్తృతంగా అభివృద్ధి చెందిన 3,500 జాతులలో ఇప్పుడు మిగిలే నాలుగు రకాలు ఫిలిప్పైన్స్‌నుంచి ఫిజీవరకు పశ్చిమ పసిఫిక్‌లో కనిపిస్తాయి.

NAUTILUS

గింకో చెట్టు లేక డ్రాగన్ ఫ్లై లాగే నాటిలస్‌లు సజీవ శిలాజాలు. 180 మిలియను సంవత్సరాల కాలం గడిచినా పరిమాణంలో ఏ కొద్దిగానో సంకోచం చెందడం తప్ప వాటిలో ఏ విధమైన మార్పు కనిపించడం లేదు. ఆధునిక నాటిలస్‌లు 20 సెం.మీ. ల కంటే పెద్దవిగా పెరగవు. పూర్వపు వాట కంటే ఇవి చాలా పొట్టివి. ఆర్కన్‌సాస్ (Arkansas) లో ఇటీవల ఏనాడో అంతరించిపోయిన 2.7 మీటర్ల పొడవైన శిలాజం త్రవ్వబడింది.

దీని జీవితం సాధారణంగా ఒ ... విరో ... ధకమైన పైగుల్లపై ఆధారపడి ఉంటుంది. ఈ జంతువు పెద్దదవుతూన్నకొద్దీ గుల్లమీద విభాగాలు ఒకదానికంటే ఒకటి పెద్దదిగా

## పెరుగుతున్న సూర్యుని పరిమాణం



ఇక 5,000 మిలియను సంవత్సరాల సూర్యుడు కుదించుకు పోయినప్పుడు ... యం తప్పదని ఇంటర్ నేషనల్ అస్ట్రా... అసోసియేషన్ జనరల్ సెక్రటరీ డా. మెక్‌వార్లీ చెబుతున్నారు. 5,000 ... యను సం.ల కు పూర్వం సూర్యుడు ఏర... నప్పుడు కంటే ఇప్పుడు సూర్యుడు ... మాణం పెరిగిపోతూందని ... రంగు నుంచి ఎరుపు రంగులోకి ... రు. ... డు. ఇది

...మగుదానికి విలపించటం నిరర్థకం.

ఉంది గదులు గదులుగా ఏర్పడతాయి. మంచి శిల్పకళా నైపుణ్యంతో జరిగే ఈ నిర్మాణం కొన్ని వారాలకు ఒక గది చొప్పున పెరుగుతుంది.

గదులలో ఉండే గాస్ పరిమాణాన్ని మార్చుకుంటూ నాటిలస్ నీటిలో తేలుతుంది లేక 600 మీటర్ల లోతుగా నీటిలోకి దిగుతుంది. సైఫంకల్ అనే గొట్టం ఈ గదులన్నిటినీ కలుపుతుంది. ఈ గదులలో గాసు ద్రవాల విస్తృతిని ఈ గొట్టమే మారుస్తూంటుంది.

గొట్టం రూపంలో ఉన్న ఒక గళ్ళా (Funnel) దీనికి కదలికను కలిగిస్తూ ఊపిరి తీసుకోడానికి సహకరిస్తుంది. గళ్ళా లయబద్ధమైన కదలికవల్ల నీరు నాటిలస్ శరీరంలో ఉన్న పల్లంలోకి ప్రవహిస్తుంది. ఇక్కడ గిల్స్ (gills) శ్వాసేంద్రియములు నీటిలో ఉండే ప్రాణవాయువును పీల్చుకుంటాయి. గళ్ళాకి ఉండే రెండు పొడుగాటి మీసాల సహాయంతో నాటిలస్ జలాశయంలో మిట్టపల్లాలను తెలుసుకుంటుంది.

నాటిలస్ సాధారణంగా వెనుకకు జరుగుతూ ఈదుతుంది. గళ్ళాగుండా నీటిని పిచికారీలా వదులుతుంటుంది. దీనివల్ల ఇది వెనుకకు జరుగుతూ ఉంటుంది. పగటిపూట ఇది పగడపు గట్లదగ్గర ఆహారం తినేటప్పుడు ఈ గళ్ళా సహాయంతో సమతలంగా కదులుతూ ఉంటుంది. నాటిలస్ మీసాల సహాయంతో వాసన చూడగలుగుతాయి. ఎండ్రకాయవంటి నీటి జంతువులను పట్టుకోడానికి కూడా ఇవి సహకరిస్తాయి. కొంచెం కదిపితే ఇవి మీసాలను లోపలకు ముడుచుకుంటాయి. పైన ఒక చర్మంలాంటి పొరను కప్పేస్తాయి.

సముద్రంలో ఇతర జంతువులు ఏవీ నాటిలస్‌ను తినవు. కానీ పైగుల్లమీద కొరికిన గుర్తులవల్ల నాటిలస్‌లు ఒకదానితో ఒకటి పోరాడతాయని తెలుస్తూంది.

—'పిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## మొట్టమొదటి ఎటామిక్ రియాక్టరు 1942 లో నిర్మించబడింది




ఆధునిక ప్రపంచంలో అణుశక్తిని ఉత్పాదించే ఎటామిక్ రియాక్టరు ముఖ్యపాత్రను

''ఏదీకోరని స్థితిని నీవు అందుకోగలిగితే నీ కోరికలన్నీ ఫలించినట్లే.

# వీరిని గురించి తెలుసుకోండి

**ఓ.హెన్రీ (1862-1910):**

బహుళ ప్రచారం పొందిన చిన్న కథలను రూపొందించిన అమెరికన్ కవి. చిరస్థాయిగా జ్ఞాపకం ఉంచుకోతగిన అనేక



O. HENRY

పాత్రలను ఇతడు సృష్టించాడు. "దిఫోర్ మిలియన్" మరియు "ది ట్రిమ్డ్‌లాంప్" అనే ఇతడు వ్రాసిన కథల సంపుటాలలో పెద్ద పెద్ద నగరాలలో సామాన్య ప్రజల జీవితాలను అభివర్ణించాడు.

* * *

**వేలుతంబి:**

ట్రావెన్‌కూర్ (ఇప్పుడు కేరళరాష్ట్రంలో ఒక భాగము) సంస్థానంలో దివానుగా ఉంటూ బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జెండాను ఎగురవేశాడు. క్విలన్‌లో ఇతడి అనుచరులు బ్రిటిషు సైనిక దళాలను ఎదుర్కొని తీవ్రపోరాటం సలిపారు. 1809 వ సం. రం ఫిబ్రవరిలో బ్రిటిషువారు త్రివేండ్రం స్వాధీనం చేసుకున్నప్పుడు ఇతడు అడవులలోకి పారిపోయి అక్కడ గాయాల తీవ్రతకు మరణించాడు.

* * *

**జెంఘిస్‌ఖాన్ 1167-1227):**

గొప్ప చారిత్రక వీరుడు. ఇతడి మంగోల్ సామ్రాజ్యం ఉత్తర దిక్కులో ఉన్న కాస్పియన్ సముద్రతీరం నుంచి తూర్పున ఉన్న పసిఫిక్ తీరంవరకు వ్యాపించింది. ఇతడు శత్రువులలో అంతఃకలహాలు కలిగించి, భయాన్ని రేకెత్తించి సామ్రాజ్యాన్ని వ్యాపింపచేసాడు.

* * *

**శామ్యూల్ గొంపెర్స్ (1850-1924):**

ఆంగ్లేయుడు, అమెరికన్ ట్రేడ్ యూనియన్ లీడరు. ఇతడు 37 సంవత్స

(మిగతా 21 వ పేజీలో)

**భవిష్యత్తులోకి నిర్భయంగా సాగండి**

గడచిన రోజులకి విచారపడకండి. అవి ఎలాగూ తిరిగిరావు. వర్తమానం మీ చేతుల్లో ఉన్నది, మీది. గనుక దానిని [illegible] ప్రయత్నించండి. [illegible] బాటన సాగి ఉంటే భవిష్యత్తులోకి నిర్భయంగా ఆత్మస్థైర్యంతో ముందుకి సాగండి.

"సదాలోచన, సరస సంభాషణ భావకాలుష్యాన్ని నిరోధిస్తాయి."

# ఆపిల్ ఆఫ్ డిస్కార్డ్

బైబిల్ ప్రకారం మానవజాతి పుట్టుకకి, ఆపిల్ పండుకి ఎంతో సన్నిహితమైన సంబంధం ఉంది. నిషేధింపబడిన ఆపిల్ పండు ఆడమ్-ఈవ్‌ల కంటబడకుండా ఉండి ఉంటే వారిద్దరూ ఇప్పటికీ ఈడెన్ తోటలో శాశ్వతమైన ఆనందాన్ని అనుభవిస్తూండే



వారే. అమరజీవులై అనంత సౌఖ్యాలతో తులతూగుతూండేవారే.

భూమ్యాకర్షణ సిద్ధాంతాలను నిర్వచించిన న్యూటన్ మహాశయుని శిరస్సుపై ఆపిల్ తప్ప మరేపండు పడింది? చాలామంది ఆపిల్ పండును ఆరోగ్యభాగ్యానికి, సౌందర్యాభివృద్ధికి చిహ్నంగా పరిగణిస్తారు.

'రోజుకో ఆపిల్ వైద్యుని దూరంగా ఉంచుతుంది' అన్నారు ఆంగ్లంలో. అంటే ప్రతిరోజూ ఒక ఆపిల్ తింటే ఆరోగ్యం లభిస్తుంది. వైద్యుని సంప్రదించే అవకాశ ండదు అని దీని అర్థం. అందమైన త్రయిని ఆపిల్ పండుతో పోల్చడం త్యుల సంస్కృతి, సాంప్రదాయము.

సుప్రసిద్ధ గ్రీకు పురాణగాథలలో. రిస్, ఆపిల్ ఆఫ్ డిస్కార్డ్ కథ అందరికీ సినదే. ఒకరోజున ముగ్గురు వృత్ష దేవతలు హీరా, అథెనా, ఎఫ్రొడైట్‌లలో ఎవరికివారే ఇతరులకంటే అందమైన వారమనుకుంటూ ఎవరు అందరికంటే మిక్కిలి అందగత్తెనని పోటీలు పడుతున్నారు. ఈ సమస్యను తెగింపు చేసుకోలేకపోయారు. ఆలోచించి చివరకు ఒక అమాయకుడైన పారిస్ అనే గొల్లపిల్లవాడిని పిలిచారు. అతడితో సంగతి చెప్పారు. తమలో తాము తీర్చుకోలేని తగాదాకి న్యాయమైన తీర్పు చెప్పమన్నారు.

ఆపిల్ పండుమీద 'అందరికంటే అందగత్తె' అని వ్రాసి దానిని గొల్లవాడి చేతిలో పెట్టారు. ఆ ఆపిల్‌ను తనకు ఇస్తే పారిస్‌ని మానవలోకానికి మహారాజుగా చేస్తానని హీరా చెప్పింది. తనకిస్తే విజ్ఞానాభివృద్ధితో విజయవంతునిగా చేస్తానని అథెనా చెప్పింది. 'ఆపిల్ నాకిస్తే నిన్ను ఒక అందమైన వానినిగా మార్చేస్తా' అని ఎఫ్రొడైట్ చెప్పింది. వెంటనే పారిస్ ఆలోచించకుండా ఆ ఆపిల్‌ను ఎఫ్రొడైట్ చేతులలో పెట్టాడు. దాంతో పూర్తికాలేదు వాదం. మరింత తీవ్ర పరిణామం చెందింది. దీనివల్ల ఇంగ్లీషులో 'ఆపిల్ ఆఫ్ డిస్కార్డ్” అనే పదం ఏర్పడింది.

'తృప్తి చెందిన మనస్సుకి ప్రతిక్షణం పండుగే.''

# చేయి – అరచేయి

అనేక జన్మల సుకృతంవల్ల లభించింది మానవజన్మ. ఈ జన్మను పొందిన మానవశరీరంలో ముఖ్యమైన అంగం చేయి. మానవుడికి ఏ అంగం లోపించినా వికలాంగుడై పోతాడు. తెలుగులో చేయి, చే, చై, సంస్కృతంలో హస్తము. చేతులవ్రేళ్ళు దగ్గరచేసి చేతులు జోడిస్తే నమస్కారం అవుతుంది. ఈ నమస్కారమే చేమొగుపు, చేమొగువు, చేమోడుపు, చేమోడ్పు, చేవిచ్చు, చేవిప్పు. చేదాపు.

ఒకరి పనికి, మాటకి కూడా సాయపడే వాడు చేదోడు వాదోడు. తనకు సంబంధం లేకపోయినా ఇతరుల పనులలో కలుగజేసుకోవడం, క్రోధోద్రేకంతో ఒకరిని కొట్టడం చేయి చేసుకోవడం. ఒకరికి దానమిస్తే చేయి మీద, దానం పుచ్చుకుంటే చేయిక్రింద. చేపట్టుకూడా అవుతుంది. లంచాలు స్వీకరిస్తే బల్లక్రిందచేయి. ఒకరిని యాచించకుండా గౌరవంతో కార్యం నడుపుకుంటే చేతి మీదుగా నడిచిపోతుంది ఏపనైనా. ఏ వ్యవహారంలోనైనా నష్టం వచ్చిందా అది చేతగులు లేక చేతవులు. చేతిలో కానులేని నిర్ధనుడు చేబోడి. ఇంకొకరి ఆశ్రయంలో అతిదీనంగా ప్రవర్తించేవాడు చేతులు పిసుకు కుంటాడు. పద్దు మొదలైనవి వ్రాయకుండా వడ్డీలేకుండా స్వల్పకాలంలో తీర్చడానికి తీసుకున్న అప్పు చేబదులు. వ్రాసేటప్పుడు వచ్చే తప్పు చేతప్పు. దురుసుతనంతో వ్యవహరించేవాడు చేవాడి, చేవాడికాడు. దొంగ లేక చోరుడు, వాడే చేచురుకువాడు.

ఎక్కువ కాంతిలో ఎదుటి వస్తువులు మన కళ్ళకు బాగా ఆనవు. అవి బాగా కనిపించడానికి చేతితో కంటికి పెట్టుకునే అడ్డు అదే హస్తావరణము లేకచే వెలుగు. స్వయంగా ఎవరికి వారు చేసేది చే సేత. అందులో సాహసం కూడా ఉంటే అదే చేతాకు. ఒకరి చేతి సహాయం చే దండ, చేయూత లేకచే లాగు. అపేక్షించడం, ఆశపడటం చేచాచు అవుతుంది.

మన చేతికి అయిదు వేళ్ళుంటాయి. కాబట్టి సంఖ్యావాచకంగా అయిదు అని చెప్పడానికి ఒక చేయి అంటారు. పది మామిడి పళ్ళు రెండు చేతుల మామిడిపళ్ళు. సాధారణంగా పొద్దున్నే ఇళ్ళముందు కల్లాపుజల్లి ముగ్గుపిండితో చేతితో పెట్టేముగ్గు చేపట్టు. చేతికర్ర, చేబంతి, చేతి గడియారం, చేతి గుడ్డ. చేతిరుమాలు, చేగడియ, చేపడవ, చేపెట్టె చేతిసంచి, చేగానుక. చేకత్తి అందరికీ తెలిసినవే. కానీ ఎవరేది కోరితే అవి ఇచ్చేవాడు 'చేపట్టు గుంటము . ఎప్పటి కప్పుడు అంటే ఏరోజు కారోజు ఇచ్చేకూలి చేకూలి.

చేతి తలము లేక హస్తతలము అరచేయి. అలాగే పాద తలము అరికాలు. ప్రాణాలు విడవడానికి సిద్ధంగా ఉండేవాడు అరచేత ప్రాణాలు పెట్టుకుని ఉంటాడు. దేనినైనా సులభంగా వశం చేసుకునేవారికి అది అరచేతిలోకి వస్తుంది. అరచేతిలోకి తెచ్చుకుంటే వశం చేసుకున్నా రన్నమాట. లాలనచేయడం, బుజ్జగించడం, అరచేతిలో ఉంచుకోవడం. అరచేతిలో ఉన్న దానివలె

"అయోగ్యుడైన ఆస్తికునికన్నా యోగ్యుడైన నాస్తికుడే మేలు."

వశమైనది అరచేతిలోనిది. అరచేతిలో పండ్లు వస్తే అసంభవమైన కార్యం సాధిస్తారు. ఒకరికి ఇతరులు చెప్పక్కర్లేకుండా స్పష్టంగా కనిపించే విషయం అరచేతిలో ఉసిరికాయ. దీన్నే సంస్కృతంలో హస్తామలకం లేక కరతలామలకం అంటారు. ఇంతకంటే తనకు ఉపయోగించకపోయినా ఇతరులకు ఉపయోగపడుతుంది-అంటే తన వస్తువైనా తనకు ఉపయోగింపక పరులకు ఉపయోగ పడుతుంది చేయిదీపము లేక కరదీపము.

అరచేతి వ్రేళ్ళను నిలువుగా పెట్టి భయం లేదని సూచించడానికి ముందుకు చాచినచేయి అభయహస్తము. క్రిందికి పెట్టిన చేయి వరద హస్తం తరచుగా దేవతా విగ్రహాలలో చూస్తాం. తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరస్వామి అభయహస్తం మీరందరూ చూసినదే.

ఇందరికి నభయంబు లిచ్చు చేయి
కందువలగు మంచి బంగారుచేయి ॥వ॥
వెలలేని వేదములు వెదికి తెచ్చిన చేయి
భూకాంత కౌగలించిన చేయి

* * *

వలనైన కొనగోళ్ళవాడి చేయి
తవిలి బలిచేత దానమడిగిన చేయి
ఒనరంగా భూదానమొసగు చేయి

* * * మోక్షంబు
తెరువు ప్రాణులకెల్ల తెలిపెడి చేయి.

శ్రీ స్వామివారి హస్తాన్ని ఎంత రస వంతంగా వర్ణించారో అన్నమాచార్యులు!

అరచేయి సామాన్యమా! అరచేతిలో వైకుంఠం. సాక్షాత్తు లక్ష్మీదేవి, సరస్వతీ దేవి, పరమాత్ముడైన గోవిందుడు నివసించేదే అరచేయి. అందుకే ప్రతిరోజూ నిద్రలేవడం తోటే అరచేయి చూసుకోమన్నారు. 'కరాగ్రే వసతే లక్ష్మి, కరమధ్యే సరస్వతీ, కరమూలే గోవిందః' అని స్తోత్రం చేసుకోమన్నారు. చేతి చివర లక్ష్మీదేవిని, మధ్యభాగంలో సరస్వతీదేవిని, మూలభాగంలో గోవిందుని

## అరిస్టాటిల్ చేసిన పెద్ద పొరపాట్లు


ARISTOTLE

సుప్రసిద్ధ వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు అరిస్టాటిల్ (384-322 బి.సి.) పెద్ద పెద్ద పొరపాట్లు చేసాడు. జ్ఞానవాడులు మెదడులో గాక హృదయంలో ఉంటాయని నేర్పిం చాడు. భారవంతమైన వస్తువులు తేలిక వాటి కంటే వేగంగా భూమిమీదికి పడతాయని చెప్పాడు. పైకి విసిరిన రాళ్ళకు కొంత వాతావరణం వల్ల కూడా వాటిలో కదలిక కలుగుతుందని చెప్పాడు.

'ఆహారముకంటే జీవితం ముఖ్యం, దుస్తులకంటే దేహము ముఖ్యము.

సన్నిధానం చేసుకుని ధ్యానిస్తూ చేతిని చూసుకోవాలి. అప్పుడే ఆ రోజు మంగళమయం అవుతుంది. సంపత్తును, విద్యను సంపాదించి, దాంతో గోవిందుని అనుగ్రహం పొంది పరమపురుషార్థమైన మోక్షం పొందడం మన కర్తవ్యం. దానికోసం ఇతరులను ఆశ్రయించకుండా ఎవరికివారే స్వయంగా ప్రయత్నించి సంపాదించుకోవాలి. తనచేతి చివర లక్ష్మి ఉందంటే చేతితో కర్మ చేస్తే మనకు సంపత్తు లభిస్తుంది. సక్రమంగా చదువుకుంటే సరస్వతీదేవి వరిస్తుంది. మనం స్వంతంగా సాధనచేస్తే ఆ గోవిందుడు మన భక్తికి వశుడైపోతాడు. అందుచేతే సంపత్తు, విద్య, మోక్షం మన చేతిలోనే ఉన్నాయి. ఇంకొకరిని నమ్మి మోసపోనక్కరలేదు.

పదివ్రేళ్ళతో ఉండే రెండుచేతులు మానవునికి మహోత్కృష్టమైన సంపద. ఆ చేతులను ఉపయోగించుకోడానికి స్వాధీనుడై ఉంటాడు మానవుడు. ఎవరిచేతులతో వారు స్వకర్మను ఆచరించి తరించడం గౌరవప్రదం. దైవం వేరు; పురుషార్థం వేరు. రెంటికి పొందికలేదు. భగవంతుడు 'చేతుల' సహాయం కల్పించాడు. దైవమిచ్చిన చేతులతో అన్ని అర్థాలను సిద్ధించుకోడం మానవుని కర్తవ్యం. ఎవరు తమ చేతులతో తమ తమ కార్యాలను నెరవేర్చుకుంటారో వారు ధన్యులు. ఇంకొకరిని అపేక్షించక్కర్లేదు. చేతులకంటె అధికమైన లాభం ఇంకొకటి

(మిగతా 17 వ పేజీలో)

## లియోనార్డో డా విన్సి సర్వతోముఖ పాండిత్యం



ఇటలీకి చెందిన లియోనార్డో డావిన్సి (1452-1518) ఒక గొప్ప శిల్పి, చిత్రకారుడు, గాయకుడు, సంగీత కళా విశ... కల్పనా చతురుడు, ఇంజనీరు, ...డు, శరీరక శాస్త్రజ్ఞుడు, అగోచ... ...సించిన ... ప్రపంచ... మోనాలిసా, మరియు జీవన్ ...చిత్రం 'దిలాస్ట్ సప్పర్'

‘‘వండలేని అమ్మ గరిటె వంకర అంటుంది.’’

# ఖగోళ విషయాలు

కొన్ని నక్షత్రాల గుంపుని తారాగణము (కాన్‌స్టలేషన్) అంటారు.

బృహస్పతి గ్రహానికి అత్యధికంగా చంద్రులు ఉన్నాయి.

భూమికి, సూర్యునికి మధ్యదూరము 150 మిలియను కిలోమీటర్లు.

భూమికి ఉపగ్రహమైన చంద్రునిమీద పర్వతాల గరిష్ఠ ఎత్తు 10,000 మీటర్లు.



అంతరిక్షంలో విజయవంతంగా ఎగిరి వచ్చిన రాకేష్‌శర్మ (ఇండియన్ ఎయిర్ ఫోర్సు) మొట్టమొదటి భారతీయ అంతరిక్ష నావికుడు.

వాతావరణంలో అయనోస్ఫియర్ (Ionosphere) అనే ఒక పొర రేడియో ప్రసారానికి సహకరిస్తుంది.

యునైటెడ్ స్టేట్స్ నెయిల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అపోలో కాప్సూల్‌లో చంద్రగ్రహంలో ప్రవేశించిన మొదటి మనిషి.

యుఎస్ఎస్ఆర్‌కు చెందిన యూరి గగారిన్ అంతరిక్షంలోకి ప్రవేశించిన మొదటి వ్యక్తి.

జూలై 24, 1981 న మొట్టమొదట శ్రీహరికోట (ఆంధ్రప్రదేశ్)నుంచి కృత్రిమ ఉపగ్రహం కక్ష్యలోకి విడువబడింది.

యుఎస్ఎస్ఆర్‌కు చెందిన ఎలెక్సి లియోనోవ్ అంతరిక్షంలో నడచిన మొదటి వ్యక్తి.

ఆండ్రోమిడా భూమికి మిక్కిలి దగ్గరగా ఉండే (గలాక్సీ - పాలపుంత) నక్షత్రాల గుంపు.

ఇటలీకి చెందిన గెలీలియో 1610లో శని గ్రహం యొక్క వలయాలను కనిపెట్టాడు.

యూరప్. మరియు అమెరికాల మధ్య మొట్టమొదట నేరుగా టెలివిషన్ సాధ్యపర చిన ఉపగ్రహము టెల్‌స్టార్ I.

## ప్రపంచంలో మిక్కిలి చిన్న బైబిల్

ప్రపంచంలో మిక్కిలి చిన్న బైబిల 1895 లో స్కాట్లండ్ (యునైటెడ్ కింగ్‌డమ్) లో అచ్చు కావింపబడింది. ఒక పోస్టేజి స్టాంపులో సగముండే ఈ బైబిలును అతి సులభంగా చేతి ఉంగరంలో ఇముడ్చుకోవచ్చు. ఇందులో ఉండే విషయాలు చదువుకోవడానికి దుర్భిణీ యంత్రం (magnifying glass) అవసరంఉంటుంది.

(16 వ పేజీ తరువాయి)

లేదు. హస్తప్రాప్తి గలవారు ఎంతటి పుణ్యాత్ములో! బ్రహ్మాండమైన ఈ ఒక్క లాభాన్ని సక్రమంగా వినియోగించుకున్నవారు స్వాభిమానాన్ని రక్షించుకున్నవారు.

— శాదూరి

# అక్కడా-ఇక్కడా

## 6,200 కి మీ. బ్రాడ్‌గేజ్ మార్గం విద్యుదీకరణ చేయబడింది

ప్రస్తుతం భారతీయ రైలుమార్గంలో 8000 ఆవిరి యంత్రాలు తిరుగుతున్నాయి. వీటిలో 600 సాలీనా బదలాయించబడుతూంటాయి. ఇప్పుడున్న 30 శాతం విద్యుదీకరణ రైలుమార్గం మరో 15 సంవత్సరాలలో 60 శాతం అవుతుంది. మొత్తం భారతదేశంలో ఉన్న 40,000 కి.మీ.ల బ్రాడ్‌గేజ్ రైలుమార్గంలో 6,200 కి.మీ.లు ఇప్పటికే విద్యుదీకరణ అయింది. 3,500 కి మీ.లు 7 వ ప్రణాళిక కాలంలో విద్యుదీకరణ చేస్తారు.

## అల్ట్రా మోడరన్ టాక్సీ

యు.ఎస్.ఎ. చికాగోలో జాన్‌క్లోక్ అను వతడు మూడ్‌లైట్స్ వెనీషియన్ బ్లైండ్స్, ఫోను, స్టీరియో, టెలివిజన్, వీడియో కాసెట్ రికార్డరు, కాక్‌టెయిల్‌బార్ సౌకర్యాలు కలిగి ఉన్న అతినూతన టాక్సీని నడుపుతున్నాడు.

## గ్రేటర్ బాంబూ లెమూర్స్ జంతువులు కనుగొనబడ్డాయి

1972 నుండి అంతరించిపోయాయి అనుకున్న జంతుజాతి గ్రేటర్ బాంబూ లెమూర్‌లు పశ్చిమ హిందూ మహాసముద్రంలో రిపబ్లిక్ ద్వీపం మడగాస్కర్‌కు ఆగ్నేయ దిక్కుగా వర్షారణ్యాలలో కనుగొనబడ్డాయి. డ్యూక్ యూనివర్శిటీకి చెందిన విద్యార్థి సలిపిన యాత్రలో 35 ఈ జాతి జంతువులను కనుగొన్నాడు.

— 'పిజిఐ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

క్విజ్ - జవాబులు:

1. (సి) గుజరాత్, 2. (బి) ట్యాంగ్ షో, 3. (బి) పోర్‌బందర్, 4. (ఎ) నార్మన్ బోర్‌లాగ్, 5. (బి) రాజేంద్ర ప్రసాద్, 6. (ఎ) మదర్ థెరిసా, 7. (సి) యుఎస్ఎ, 8. (బి) హాకీ.

తెలివికిపరీక్ష - జవాబులు: 1. ధర్మము, అధర్మము, 2. ¼ భిన్నము కలిపితే 19¼, 3. ఆదిదేవుడు, పురాణపురుషుడు, అనంతరూపుడు, 4. హుషార్-ఉషారు, లూటీ, తమాషా, 5. దంత వైద్యుడిని, 6. తలుపు తెరిచి ఉంచినప్పుడు.

మాటలమహిమ - జవాబులు: 1. ధనము (ఎ), పిడివమురి (బి); 2. డబ్బు పెట్టుకునే సంచి (ఎ), తాంబూలము (సి), విడెము (డి); 3. వావవదేటప్పుడు శీతలము (ఎ), చలి (బి), కంపము (సి); 4. విమురు (ఎ), వెదకు (బి), సంపాదించు (సి), ఆలస్యము (డి); 5. ఉత్సవము (ఎ), అల్లరి (బి), తీర్థయాత్ర (సి); 6. రుచి (ఎ), వలపు (బి), ఆశ (సి), ప్రియము (డి); 7. ఉప్పులేనిది (ఎ), ఉపవాసము (బి), ఉడకబెట్టిన వడ్ల బియ్యము (డి); 8. శ్రేష్ఠము (ఎ), అంచు (బి).

"కృషికి తగిన ఫలితం లభిస్తే ఎవరికైనా ఆనందమే."

## గ్యాసుపై ఆధారపడిన భారతదేశపు మొట్టమొదటి స్పాంజ్ ఐరన్ ప్రాజెక్ట్

సుమారు 8,80,000 tpa శక్తితో రూ. 05 కోట్ల ఖర్చుతో భారతదేశపు మొట్టమొదటి గాస్ ఆధారపు స్పాంజ్ ఐరన్ ప్రాజెక్ట్ గుజరాత్‌లో సూరత్ జిల్లాలో హజీరా అనే చోట నిర్మింపబడుతూంది. దీనికి కావలసిన ముడి పదార్థం—ఇనుప ఖనిజం చిన్న చిన్న గోళీలు (pellets) గా గోవా మరియు కర్ణాటకా రాష్ట్రంలో కుద్రేముఖ్ ప్రదేశాలనుండి సముద్రమార్గం మీదుగా రవాణా చేయబడుతుంది.

## నెలసరి 3,08,000 డాలర్లు డొనేషన్లు

ప్రపంచంలో మిక్కిలి పేద దేశం అయిన బర్మాలో ది ష్వేడగోన్ పగోడా (బౌద్ధ దేవాలయానికి) చందాలు విపరీతంగా ప్రోగవుతున్నాయి. ప్రతీ నెలా హుండీలలో చేరే సొమ్ము 3,08,000 డాలర్లు. ఈ దేవాలయంలో స్థూపంపైన పొదిగిన బంగారం, వివిధ విగ్రహాల మీది బంగారు మొత్తం విలువ దేశంలో విదేశీ వినిమయపు రిజర్వుల కంటే అధికంగా ఉంటుంది.

## క్రొత్తరకం సోలార్ కుక్కర్

సిడ్నీ యూనివర్శిటీలో పరిశోధనలు చేస్తున్న ఆస్ట్రేలియా పరిశోధకులు గాస్ మరియు ఎలక్ట్రిక్ స్టౌలతో సరిసమానంగా పనిచేసే ఒక క్రొత్త సోలార్ కుక్కర్ (సూర్యుని వేడితో పనిచేసే కుక్కర్) ను అభివృద్ధి చేసారు. ఈ క్రొత్త సోలార్ కుక్కర్‌కి కదిలే విడిభాగాలు ఉండవు. సర్వసాధారణమైన వస్తువులతో తయారైంది. వేయించుకోడానికి, రొట్టె కాల్చుకోడానికి, ఆవిరితో ఉడకపెట్టుకోడానికి సహకరిస్తుంది. దీని హాట్‌ప్లేట్‌ను ఇంటి లోపల పెట్టుకోవచ్చు. సూర్యాస్తమానం అయిన తరువాత కూడా ఇందులో నిల్వ చేయబడిన సూర్యతాపంతో వంట వండుకోవచ్చు.

## మానవుడు మానసికంగా కల్పించుకునే ఎల్లలు



జ్ఞానాభివృద్ధి కలుగుతూన్నకొద్దీ మానవుని స్వార్థపరత్వం అస్థిరమైపోయి మానసికంగా కల్పించుకున్న సరిహద్దులు ఒకదానివెనుక అంతర్థానమైపోతాయి. మనం గడించు కీర్తి ప్రతిష్ఠలకు లోటు కలుగునప్పుడల్లా అవమానంతో క్రుంగి[illegible]ం. కానీ దీనికి తలఒగ్గి ఉండాలి. స్వార్థత్వంతో విభాగం, విచ్ఛేదము ఏర్పరచుకుంటాంకే సత్యమనే చక్రం క్రింద కీర్తి ప్రతిష్ఠలు నలిగి నశించిపోతాయి.

—రవీంద్రనాథ్ ఠాగూర్

ంచుకుంటే ఆ[illegible]దం అధిక

# యాత్రాస్థలాలు

## బద్రీనాథ్

హిందువుల సుప్రసిద్ధ యాత్రాస్థలాలలో మిక్కిలి పవిత్రమైనది బద్రీనాథ్ క్షేత్రము. తమిళనాడులో రామేశ్వరము. గుజరాత్‌లో ద్వారక, ఉత్తరప్రదేశ్‌లో వారణాశి (కాశి), ఒరిస్సాలో పూరీ జగన్నాధ్ మిగిలిన నాలుగు ముఖ్య పుణ్యక్షేత్రాలు




ఉత్తర ప్రదేశ్‌లో మంచుతో కప్పబడిన గంభీరమైన హిమాలయ పర్వతశ్రేణిలో సుమారు 10,200 అడుగుల ఎత్తున ఉంటుంది బద్రీనాథ్ దేవాలయము. ఈ దేవాలయానికి ఎదురుగా అలక్‌నందా నది ప్రవహిస్తూంటుంది. యాత్రికుల దర్శనార్థం వేసవికాలంలోనే ఈ దేవాలయం తెరవబడి ఉంటుంది. శీతాకాలం పూర్తిగా మూయబడే ఉంటుంది. ప్రతీసారి 100 000 మంది యాత్రికులు, భక్తులు ఈ దేవాలయాన్ని దర్శిస్తారు.

సాధారణంగా బద్రీనాథ్ దేవాలయం తలుపులు మేనెల రెండవ వారంలో తెరుస్తారు. తలుపులు తెరిచే మొదటిరోజునే ఇక్కడ దేవుని దర్శనం చేసుకుంటే పుణ్యఫలం అధికమని భక్తుల విశ్వాసం.

పద్మాసనంలో ఉన్న బద్రీ నారాయణమూర్తి ఇక్కడి దేవతా విగ్రహము. A.D 7వ శతాబ్దంలో ఆదిశంకరాచార్యులవారు ఈ దివ్యమూర్తిని గర్భగుడిలో ప్రతిష్ఠాపన చేశారు. గర్భగుడిలో పైన అమర్చిన బంగారు చాందినీ గొప్ప భక్తురాలు, దానశీలి అయిన మహారాష్ట్ర రాణి అహల్యాబాయి హోల్కార్ ఇచ్చిన కానుక. శ్రీ శంకరాచార్యులవారికి బద్రీనాథ్‌లోనే జ్ఞానోదయమైంది, ఆత్మజ్ఞానం వికసించింది. మనోహరమైన బద్రీ నారాయణుని దివ్యమంగళరూపం భక్తి పారవశ్యంతో చూస్తూంటే భక్తులు అపారమైన నిరంతర శాంతి సౌఖ్యాలను అనుభవిస్తారు.

### హైపోథాలమస్ బరువు నాల్గో వంతు ఔన్సు మాత్రమే

మానవ మెదడులో మిక్కిలి చిన్నభాగం హైపోథాలమస్ (Hypothalamus). ఇదే శరీరంలో రక్తపు ఒత్తిడి, ఆకలి, దాహం, భయము, నిద్ర, శరీర ఉష్ణము వగైరాల నియంత్రిస్తుంది. దీని బరువు ఔన్సు నాల్గవ వంతు మాత్రమే.

"వంశం కాదు, శీలం ప్రధా

డా. ఎ

దివ్యాభరణ భూషితుడైన బద్రీ నారాయణుని ఎడమప్రక్క లక్ష్మి, నరనారాయణులు ఉంటారు. నరుడు నారాయణుడు పద్మాసనంలో ఆసీనులై ఉంటారు. ముఖ్య దేవతా మూర్తి బద్రీనారాయణుని కుడిప్రక్క ధనాధిపతియైన కుబేరుడు, ఉద్ధవుడు, గణేశుడు ఉంటారు.



నారదుని విగ్రహం ఎదురుగా ఉంటుంది. దీనికి ప్రక్కగా ఒక వెండి గరుడ విగ్రహం కూడా ఉంది. సుదర్శన యంత్రంమీద ప్రతిష్టాపించి నిర్మించబడిన ఈ దేవాలయం ఎప్పుడూ ఆధ్యాత్మిక చైతన్యంతో కళకళలాడుతూ ఉంటుంది. స్తంభాలమీద సూర్య చంద్రులు అలంకరింపబడి ఉన్నాయి. సంవత్సరం పొడుగునా గుడిలో నిత్యం నేతి దీపాలు వెలుగుతూంటాయి.

ఇచ్చట నిత్యపూజలు, నైవేద్యాలు కేరళ దేశానికి చెందిన నంబూద్రి బ్రాహ్మణులే చేస్తారు. పూజారి మాత్రమే విగ్రహానికి పూజలు చేయడానికి అర్హుడు యాత్రా మార్గం ఏప్రిల్ నెలనుండి అక్టోబరు నెల వరకూ యాత్రికులతో నిండి ఎక్కువ సందడిగా ఉంటుంది. యాత్రామార్గం పొడవునా దారిలో విశ్రాంతి గృహాలు ఉన్నాయి.

బద్రీనాధ్ యాత్రకి ముఖ్యంగా ప్రసిద్ధి పొందిన మార్గాలు రెండు ఉన్నాయి. ఒక మార్గం ఋషికేశ్ నుంచి, మరో మార్గం "కోట్‌ద్వారా" నుంచి బయలుదేరుతుంది. బద్రీనాధ్ దేవాలయం వరకు బస్ సౌకర్యం ఉంది మే మాసం మొదలు జూన్ మధ్య వరకూ మరియు ఆగస్టు నుంచి అక్టోబరు వరకూ యాత్రకు చాలా అనుకూలంగా ఉంటుంది. యాత్రకు వెళ్ళేవారు రెండు కంబళ్ళు, ఒక ఉన్ని స్వెట్టర్ తెచ్చుకుంటే చాలు.

బద్రీనాధ్‌కు వెళ్ళే మార్గం పొడవునా మరియు బద్రీనాధ్‌లో కూడా రకరకాల ఫల

---

(12 వ పేజీ తరువాయి)

రాల పాటు అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్‌కి ప్రెసిడెంటుగా ఉన్నాడు. రాజకీయ వ్యవహారాల మరియు సాంఘిక సమస్యల ప్రమేయం లేకుండా సభ్యులకు ఉత్తమ రీతిలో ఉద్యోగ అవకాశాలు జీతాలు అనే ఆశయంతో 'బ్రెడ్ అండ్ బట్టర్ యూనియ నిజం'ను విశ్వసించాడు.

* * *

లూయిస్ ఎస్.బి. లీకి

బ్రిటిష్ ఆంత్రపాలజిస్టు. కెన్యా (తూర్పు ఆఫ్రికా) లో ఇతడు పరిశోధనలు సలిపాడు ఇతడు కనుగొన్న మిలియనుల కొద్దీ సంవత్సరాలనాటి మనుష్యుని ఎముకలు, పుర్రెలు వల్ల చరిత్రకు పూర్వపు మనుష్యులను గురించి తెలుసుకోడానికి వీలయింది.

"ప్రేమ తరిగిపోయినప్పుడు ప్రతీ పనీ త

హారాలు, పళ్ళు లభిస్తాయి. బద్రీనాథ్‌కు వెళ్ళే మార్గంలో అనేక ఇతర పుణ్యస్థలాలు ఉన్నాయి. అలక్‌నంద మరియు భగీరథీ నదులు చేరే సంగమం దగ్గర హరిద్వార్‌కు సుమారు 90 కి.మీ.ల దూరంలో దేవ. ప్రయాగ్ ఒక ముఖ్య పుణ్యక్షేత్రము. ఈ రెండు నదులు ఇక్కడ చేరి ఏకమై గంగా నదిగా ప్రవహిస్తాయి. ఇచ్చట ఒక రామా లయం ఉంది. మరో ముఖ్య యాత్రాస్థలం శ్రీనగర్ గంభీరంగా ఉండే అందమైన పర్వతలోయలో ఉంది. ఇక్కడ ఆరాధింప బడే దేవుడు కమలేశ్వరుడు. నవంబరు నెలలో వచ్చే వైకుంఠ చతుర్దశినాడు పిల్లలు లేని వారు పిల్లలు పుట్టాలని మొక్కుకుని నేతి దీపాలు చేతులలో పెట్టుకుని రాత్రి అంతా భక్తి శ్రద్ధలతో జాగరణ చేస్తూ గుడిచుట్టూ నుంచుంటారు.

మందాకిని మరియు అలక్‌నంద నదుల సంగమ ప్రదేశంలో రుద్రప్రయాగ క్షేత్రం ఉంది. ఇచ్చటి దేముడు రుద్రనాథ్-శివునికి మరోపేరు.

సముద్ర మట్టానికి సుమారు 6,107 అడుగుల ఎత్తున గల జోషి మఠానికి వెళ్ళే దారిలో యాత్రికులు నందప్రయాగ్, కర్ణ ప్రయాగ్, పిపల్‌కోట్ మొదలైన క్షేత్రాలను సందర్శించవచ్చు. జోషిమఠ్‌లో శ్రీ నర సింహస్వామికి, నవదుర్గా దేవికి, శ్రీకృష్ణునికి అంకితమైన దేవాలయాలు ఉన్నాయి.

నగరం మీదుగా అరమైలు దూరంలో జ్యోతేశ్వర్ ఉంది. ఇది ఆదిశంకరాచార్యుల వారు స్థాపించిన నాలుగు మఠాలలో ఒకటి, చిట్టచివరి యాత్రాస్థలం పాండుకేశ్వర్. ఇక్కడ రెండు ప్రాచీన దేవాలయాలు పాండవులు నిర్మించారని ప్రతీతి. ఒక దేవాలయం విష్ణువు నాలుగు రూపాలలో ఒక రూపమైన యోగధ్యానికి, రెండవది శ్రీకృష్ణునికి అంకితమై ఉన్నాయి.

బద్రీనాథ్‌ని దర్శించిన భక్తుడు సజీవ ముక్తిని అనుభవిస్తాడు అనేకమంది భక్తులు బద్రీనాథ్‌లో పాపవిమోచనం కలిగించుకుని నిరంతర శాంతిని అనుభవిస్తున్నారు.

## భగవంతుడు సృష్టించిన కంప్యూటర్



13 బిలియను (13,000 మిలియను) కణాలు కలిగిన మానవుని మెదడు 15 ట్రిలియన విషయాలను నియంత్రిస్తుంది. మానవుడు నిర్మించిన ఏ కంప్యూటర్ కూడా దీనికి సాటిరాదు. భగవంతుడు ఈ కంప్యూటర్ (మెదడు)ను చిన్న పుర్రెలో ఇమిడ్చి అరవోల్టు కరెంటుతో చైతన్యవంతం చేస్తాడు. అనేక క్లిష్టమైన సమస్యలను కొంచెం ముందుగా జాగ్రత్త పడితే వాటిని అతి సులువుగా తప్పించుకోవచ్చు.

— డెక్స్టర్ పాకనర్, 'బ్రెయిన్ ట్రాక్' సౌజన్యంతో

"యువకులు బలవంతులై ఉండాలి
ధర్మం దానంతట అదే అలవడుతుంది." — స్వామి వివేకానంద

# విజ్ఞాన దీపిక

## సులోచనాల ఉపయోగం ప్రారంభం

యూరప్ ఇటలీ ట్రెవిసోలో ఒక చర్చిలో 1352 A.D. కి చెందిన కుడ్య చిత్రంలో కార్డినాల్ యుగోన్ రెండు అద్దాలు



దగ్గరగా రివెట్ చేయబడి కళ్ళకు తగిలించుకున్నట్టు చిత్రింపబడింది. అతి ప్రాచీన కాలంలో సులోచనాల ఉపయోగం ఇదే అని తెలుస్తోంది.

## విటమినుల విలువ

సక్రమ శారీరక పోషణకు విటమినుల అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా చెమ్మగా ఉండే భాగాలు కళ్ళు, గొంతుక, చర్మం మొదలైన వాటికి విటమిను A రక్షణ ఇస్తుంది. మనం తిన్న ఆహారం శక్తిగా మారడానికి వివిధ B విటమినులు ముఖ్యం. శరీరంలో ఎర్రరక్త కణాభివృద్ధికి విటమిను C అత్యంత అవసరము. శరీరంలో ఎముకలు, నోటిలో దంతాల సంరక్షణకు విటమిను D, కాల్షియం, ఫాస్ఫరస్‌లను శరీరానికి అందజేస్తుంది.

## 'బాలెన్స్ ఆఫ్ పవర్'

17 వ శతాబ్దంలో అంతర్జాతీయ న్యాయ సిద్ధాంతాల క్రోడీకరణ సమయంలో ప్రాచీన సిద్ధాంతం 'బాలెన్స్ ఆఫ్ పవర్' ఒక నిర్దిష్ట రూపంలో వివరింపబడింది. వివిధ అధికారాలు, వివిధ సంఘాల అధికారాలు సరిసమానం చేయుట ద్వారా ప్రత్యేక సంఘ నాయకత్వం నిరోధింప జేయుటయే దీ ఉద్దేశము.

## 'ఏనిషియంట్ లైట్స్' అంటే

ఒక ఇంటి యజమాని తన ఇంటికి ప్రక్కా స్థలం నుంచి వచ్చే లైట్ (వెలుతురు) గత 20 సంవత్సరాలు నిరభ్యంతరంగా అనుభవించినట్టు ఈ సౌకర్యానికి అభ్యంతరం కలిగించే విధంగా అందులో కట్టడం కట్టి వేయకుండా స్థలం స్వంతదారులకు తెలియజేసే హెచ్చరిక.

## ప్రప్రథమ రైలుబండి

ప్రపంచంలో మొదటి రైలుబండిని రిచర్డ్ ట్రెవిథిక్ (1771-1833) నిర్మించారు. ఇది మొట్టమొదటిసారి 1804 లో మిడ్ గ్లామోర్గాన్‌లో మెర్తైర్ టైడ్‌ఫిల్ దగ్గర పెనైడారెన్‌లో ప్రయాణం చేసింది

'గురువుకి గుర్తు చేయడం గుణవం ... లక్షణం.'

## భయాన్ని ముందుగా తెలిపే క్రొత్త సాధనం:

సిడ్నిలో మాస్టర్ మిస్సెరి కార్డియాక్ హాస్పిటల్‌లో వైద్య పరిశోధన మరియు అభివృద్ధి డైరెక్టరు డా. డిక్ స్టీపెన్స్ కని పెట్టిన క్రొత్త సాధనం ఆపరేషన్ టేబిల్ మీద రోగులు భయపడినప్పుడు వైద్యులకు ముందుగా తెలియజేస్తుంది. చర్మానికి తగిల్చి పెట్టిన ట్రాన్స్‌డ్యూసర్ ద్వారా ఇది శరీరంలో రక్తప్రవాహాన్ని గురించిన వివరాలు తెలియ జేస్తుంది. రక్తనాళాలలో గానీ, మ్యూకస్ మెంబ్రేన్ పొరలలోగానీ కలిగే చైతన్యతను విద్యుత్ ప్రేరణలుగా మార్చి మెషీను రికార్డు చేస్తుంది.

## క్రొత్త సూపర్ కంప్యూటర్:

యునైటెడ్ స్టేట్స్‌లో న్యూమెక్సికో అండ్ న్యూబె కార్పొరేషన్ ఆఫ్ ఓరెగాన్‌లో సాండియా నేషనల్ లాబొరేటరీలకు చెందిన వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు అభివృద్ధి పరచిన క్రొత్త సూపర్ కంప్యూటర్లు సెకండుకు 500 మిలియన్ లెక్కలను కడుతుంది. సింగిల్ ప్రాసెసర్‌తో పనిచేసే ఈ కంప్యూటర్లు మిక్కిలి క్లిష్టమైన వైజ్ఞానిక సమస్యలను మామూలు కంప్యూటర్లకంటే 1000 రెట్లు అతివేగంగా చేసాయి.

## జపాను - ప్రపంచంలో పెద్ద ఓవర్‌సీస్ క్రెడిటార్ నేషన్:

1986 వ సంవత్సరాంతానికి ఇతర దేశాలలో జపానువారి ప్రభుత్వ మరియు ప్రజాసంబంధమైన ఆస్తుల విలువ మొత్తం 727.3 బిలియన్ డాలర్లు; అప్పులు 547 బిలియన్ డాలర్లు. దీనివల్ల జపానుకి 180.3 బిలియన్ డాలర్ల ఆస్తులు మిగిలి జపాను ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఓవర్‌సీస్ క్రెడిటార్ దేశం అయింది.

## ఎక్కువ విజయోత్సాహంగా జీవించడం ఎలా?




ప్రతీవారికి ఆధ్యాత్మిక గ్రంథాలు, ఉత్సాహపూరితమైన సెల్ఫ్ హెల్ప్ పుస్తకాలతో నిండిన ఒక చిన్న లైబ్రరీ ఉండి తీరాలి. ...వంటి గ్రంథాలు శ్రద్ధగా ..., ఆత్మ విశ్వాసం, విజయో... ...వారనే శక్తి కలుగుతాయి ...డా. నార్మన్ విన్సెంట్ పీల్

'నిస్వార్థమైన మానవ సేవ నిజమైన మాధవ సేవ.'

# అద్దాలు లేని సహజదృష్టి

ప్రసన్న

ఏ ఇతర సాధన సదుపాయాలు లేకుండా, తేటగా చూడగల శక్తినే మంచి చూపు లేక మంచి దృష్టి అంటారు. ఎక్కువ లేక తక్కువ వెలుతురులో, దగ్గర లేక దూరంగా ఉండే, చిన్న లేక పెద్ద వస్తువులను మంచి దృష్టి గలవారు సుస్పష్టంగా విశదంగా ఉన్న



దున్నట్టుగా చూడగలుగుతారు. ఇది ఇంకో విధంగా చెప్పాలంటే కళ్ళను వాటి నియమిత దూరంలో ఉపయోగించి వాటి సహజ శక్తిని నిలబెట్టుకోవాలి.

సాధారణంగా కళ్ళను ఉపయోగించుకోకుండా అలవాటును తప్పించుకోడంవల్ల, సక్రమంగా ఉపయోగించుకోకుండా దుర్వినియోగం చేసుకోడంవల్ల కంటి దృష్టి జ్ఞానము పూర్తిగా చెడిపోతుంది. ఇంట్లో వ్రేలాడదీసిన డిస్టెంట్ విజన్ కార్డు సహాయంతో హ్రస్వదృష్టిని. ఫైన్ ప్రింట్ కార్డుతో ప్రెస్బయోపియా లేక ఓల్డ్ సైట్‌ను నివారించుకోవచ్చు. ఈ కార్డుల సహాయంతో వివిధ దూరాలలో కళ్ళను పూర్తిగా వినియోగించుకోవచ్చు. అందువల్ల కంటిచూపు పరిపూర్ణంగా సహజంగా ఉంటుంది.

వీక్షణా చాతుర్యపు (Art of seeing రెండు ధర్మాలను అనుసరించడం ద్వా కంటి దుర్వినియోగాన్ని తప్పించుకోవచ్చు కంటిరెప్పలు మాటిమాటికి తెరుస్తూండడం మూస్తూండడం కంటియొక్క సహజగుణము దీనినే కళ్ళు మిణుకరించుట లేక చికిలించు అంటారు. మనోఫలకం మీద వచ్చే తరువా చిత్రాన్ని తేటపరచటం వంటిది. దీని కంటి గ్రుడ్లను అకస్మాత్తుగా తోయకుండ అంటే జెర్క్ చేయకుండా దృష్టిని అ సౌమ్యంగా ఒక వస్తువు నుంచి మరో వస్తువుకి మరల్చడం షిఫ్టింగ్ (మార్చడం) అంటారు. రైలులో కూర్చుని ముందు ప్రయాణం చేస్తూంటే చెట్లు వెనక్కి వెడుతున్నట్లు, మెట్లుపైకి ఎక్కేటప్పుడు మెట్లు క్రిందికి దిగిపోతున్నట్టు అనిపించాలి. మెట్లు దిగేటప్పుడు మెట్లు పైకి వెళుతున్నట్టు అనిపించాలి

## ఆరోగ్యవేదిక

### ఉబ్బసానికి ఉపశాంతి

ఉబ్బసం దగ్గుతో బాధపడేవారికి టైలోఫోరా (Tylophora) ఆకుల ఉపయోగిస్తే ఉపశాంతి కలుగుతుంది. టైలోఫోరా ఉత్తర భారతదేశం, తూర్పుబెంగాల్, అస్సాం వగైరా ప్రదేశాలలో విస్తారంగా పెరిగే ఒక తీగ. ఈ తీగను స్థానికంగా 'జంగ్లీ పికవాన్' (Jangli pikavan) లేక అంత

''ఎక్కడ బఢాయి తగ్గుతుందో అక్కడ హోదా పెరుగుతుంది.''

మనం కళ్ళద్వారా మనస్సుతో చూస్తాం
'బట్టి మనస్సు, కళ్ళుకూడా ఒకే సమంగా
రి సరళంగా పనిచేస్తే మన దృష్టి లోపం
కుండా ఉంటుంది. ఒక ఫోటోగ్రాఫిక్
మేరా వివిధ దూరాలలో ఉండే వస్తువులను
ోకప్ చేయడానికి దాని కదే సరిపుచ్చుకుం
ుంది. లేకపోతే సవరిస్తాము. అదేవిధంగా
ుదడు నుంచి వచ్చే ప్రేరణలను అనుస
ంచి కంటిపై కండరాలు కళ్ళలో ఫోకసింగ్
డ్జస్ట్‌మెంట్‌ను చేస్తాయి. ఇతర ఇంద్రియ
్ఞానాలకంటే కంటి దృష్టి జ్ఞానానికి ఇది ఒక
పూర్వమైన అవసరపు యాంత్రిక చర్య.
ుర్శ జ్ఞానంలో, శ్రవణ జ్ఞానంలో, ఘ్రాణ
్ఞానంలో, రుచి జ్ఞానంలో ట్రాన్స్‌మిషన్,
ిద్యుత్ప్రేరణలు మాత్రమే ఉండటంవల్ల
ిటికి వేరే శ్రమ ఉండదు.

జీవితాంతం ఆరోగ్యవంతమైన పరిపూర్ణ కంటిదృష్టితో శ్రమలేకుండా చూడడంవీక్షణా నైపుణ్యం. దీన్ని 'ఆర్ట్ అఫ్ సీయింగ్' అంటారు. 'ఆర్ట్ అవ్ సీయింగ్'ను అనుసరిస్తే దృష్టిని సరిచేసుకోవచ్చు లేదా సహజ దృష్టిని నిలబెట్టుకోవచ్చు.

'ఆర్ట్ అఫ్ సీయింగ్' అభ్యసించడానికి కొన్ని సూచనలు:

చేతితో కుట్టేటప్పుడు సూది క్రిందికి మీదికి వెళ్ళేటప్పుడు మెడపైకి క్రిందికి జరుపుతూ దృష్టిని సూది మొన మీద ఉంచు. ఏదైనా పుస్తకం చదివేటప్పుడు మెడ ఎడమవైపు నుంచి కుడివైపుకి జరుపుతూ పుస్తకం ఎడమవైపు నుంచి కుడివైపుకు జరుగుతూన్నట్టు అనుకోండి. వార్తాపత్రికలో కాలములా పైనుంచి క్రిందికి చదువుతూన్నప్పుడు దృష్టిని లైను మధ్య ఉంచి లక్ష్యం ఎడమ నుంచి కుడివైపు మార్చుకో. ప్రతీ లైను తరువాత మెడను నిలువుగా క్రిందికి దింపు. వ్రాసేటప్పుడు కళ్ళను మిటకరిస్తూ పాళీ మొన మీద దృష్టిని ఉంచు. వీక్షణా నైపుణ్యంతో చూస్తే సినిమాలు, టివిలు కూడా దృష్టిని నిలబెట్టుకోడానికి ఉత్తమ సహకారాలు.

1930 లో డా. డబ్ల్యు హెచ్. బేట్స్ అనే కంటి శాస్త్రవైద్యుడు స్థాపించిన 'నేచర్ విజన్ థెరపి' (సహజ దృష్టి వైద్యము)

(మిగతా 27 వ పేజీలో)

## 5,000 మానవ నిర్మితమైన వస్తుజాలం భూమి చుట్టూరా కక్ష్యలో తిరుగుతూంది




మానవ నిర్మితమైన 6,000 వస్తువులు భూమిచుట్టూ కక్ష్యలో తిరుగుతున్నాయి. వీటిలో 20 వ వంతు మాత్రమే కృత్రిమ ఉపగ్రహాలుగా ... పడుతున్నాయి. మిగతా రాకెట్ ముక్క... ఉపయోగపడని ... క్షంలో పనికి ... ప్రోబులు వగైరాలు అ... యాయి. ... దాని 'స్పేస్‌వేస్ట్'గా ... హెజవ్యంతో

'' సాశీల్యము, సంపద ఒకేచోట ఉండటం అరుదు.''

# నిజాలు-నిదర్శనాలు

## భారతదేశంలో ఏలకుల ఉత్పాదన:

భారతదేశం సాలీనా 4,000 మొదలు 5 000 టన్నుల ఏలకులను ఉత్పాదిస్తుంది




ఇది ప్రపంచపు ఉత్పాదన 11,000 మొదలు 12,000 టన్నులలో దాదాపు 36 శాతం.

* * *

## 'ఐఓసి' అమ్మకాలు రూ. 14,407 కోట్లు అందుకుంది:

పబ్లిక్ రంగంలో - ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ 1988 లో నెంబర్ 1 కంపెనీ అనిపించుకుంది. 1987-88 లో రూ. 14,407 కోట్ల అమ్మకాలతో పన్ను చెల్లింపులకు ముందు రూ. 571 76 కోట్లు లాభం గణించింది. మొత్తం 10 000 కి పైబడిన డీలర్లు మరియు 150 ఇన్‌స్టలేషన్ సౌకర్యాలతో ఈ సంస్థ 27.1 మిలియను టన్నుల పెట్రోలియం పదార్థాలను అమ్మింది.

## నిరుద్యోగులకు పశ్చిమ బెంగాల్‌దే ప్రథమస్థానం:

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లలో 1985 లో రిజిష్టరు అయిన 139.75,516 చదువుకున్న నిరుద్యోగుల సంఖ్య 1987 కి 167,35,362 కి పెరిగింది. 1987 లో 23,27,366 నిరుద్యోగులతో పశ్చిమ బెంగాల్ ప్రథమస్థానాన్ని పొందుతూంది.

* * *

## పబ్లిక్ సెక్టారు బాంకులలో డిపాజిట్లు:

జూన్ 1988 చివరి శుక్రవారం నాటికి పబ్లిక్ సెక్టార్ బాంకులలో మొత్తం డిపాజిట్ల విలువ రూ. 1,12,127.25 కోట్లు

(26 వ పేజీ తరువాయి)

ఇప్పుడు యునైటెడ్ స్టేట్స్, కెనడా యూరోపియన్ దేశాలు, ఆస్ట్రేలియా మొదలైన దేశాలలో బాగా ప్రచారంలో ఉంది. భారతదేశంలో సహజదృష్టి వైద్య చికిత్సను చేస్తూన్న సంస్థలు, 'ది స్కూల్ ఆఫ్ పర్‌ఫెక్ట్ ఐసైట్, ఆరోవిల్లీ (పాండిచ్చేరి) గవర్నమెంట్ ఇండియన్ మెడిసిన్ హాస్పిటల్, బెంగళూరు'. ఈ విధానాన్ని అనుసరించి సుప్రసిద్ధ నవలా రచయిత ఆల్డస్ హక్స్‌లే మరియు తాత్త్వికుడు జిడ్డు కృష్ణమూర్తి బాగా లాభాన్ని పొందారు.

దకు కొన్నే అవసరమైతే, భోగి
కావాలి, పేరాశకి అన్నీ కావాలి.''

## గంగానది పునర్వ్యవస్థీకరణకు రూ. 250 కోట్లు:

ప్రపంచంలో మిక్కిలి పవిత్రమైనదిగా గౌరవింపబడే 2,525 కి.మీ ల గంగానది 600 కి.మీ లు మానవ మరియు జంతు



సంబంధమైన వ్యర్థపదార్థాలతో కాలుష్యం చెందిపోయింది. దీని గట్లమీద ఉండే 100 కి పైబడిన చిన్న, పెద్ద నగరాలు ప్రతీ సంవత్సరం మిలియనుల కొద్దీ టన్నుల శుద్ధి చేయని మురికి నీటిని ఇందులోకి వదులుతున్నాయి. వాడిన నీటిని వదులుతూన్న 132 పారిశ్రామిక సంస్థలలో 12 సంస్థలకు మాత్రమే శుద్ధీకరణ సౌకర్యం ఉంది. గంగా ఏక్షన్ పథకం క్రింద ప్రభుత్వం వారు గంగానది పునర్వ్యవస్థీకరణకు రూ. 250 కోట్లు వెచ్చిస్తున్నారు.

— 'యునైటెడ్ నేషన్స్ పొల్యూషన్ ఫండ్ రిపోర్టు ఆన్ ది స్టేట్ ఆఫ్ వరల్డ్ పాపులేషన్, 1988 సౌజన్యంతో

* * *

## రూ. 183 కోట్ల విలువగల తివాసీల ఎగుమతి:

1980 నుంచి 1986-87 వరకు తివాసీల ఎగుమతివల్ల మొత్తం రూ. 182.9 కోట్ల ఆదాయం లభించింది. ఇది 1970-79 లో ఎగుమతుల మొత్తంవిలువ రూ. 58.3 కోట్ల కంటే మూడు రెట్లు అధికం.

* * *

## విద్యుదుత్పాదక రంగంలో బొగ్గు వినియోగం 50.3 శాతం:

భారతదేశంలో మొత్తం 182.69 మిలియను టన్నుల బొగ్గు వినియోగంలో సుమారు 50.3 శాతం విద్యుదుత్పాదక రంగంలో వినియోగమవుతూంది. స్టీలు మరియు కోక్ సెక్టారులలో మరో 14.4 శాతం, సిమెంటు సెక్టారులో 5.2 శాతం, రైల్వేలలో 4.8 శాతం, ఎరువుల సెక్టారులో 2.7 శాతం వినియోగమవుతూంది.

* * *

## భారతీయ సిల్కు ఎగుమతులలో పెద్ద సాధన:

1987-88 లో భారతీయ సిల్కు ఎగుమతులు ఒక్కసారిగా 23 శాతం పెరిగి రూ. 254.96 కోట్లు అయింది.

## అరుణాచలప్రదేశ్ వన మూలికలకు దివ్యోద్యానం

అమూల్యమైన వన మూలికలకు అరుణాచల ప్రదేశ్ దివ్యోద్యానంగా ఉంది. 1,329 రకాల వనమూలికలు వాటికి ప్రత్యామ్నాయాలు కూడా ఇక్కడ పోట్లుకొబడ్డాయి.

"అజ్ఞానంలేని జ్ఞానం చీకటిలేని వెలుతురు లాంటిది, దుఃఖంలేని సుఖం లాంటిది."

## మందు ఎరువుల ఉత్పాదన 14 రెట్లు పెరుగుదల:

భారతదేశంలో 1966_67 లో ఉన్న .455 మిలియను టన్నుల ఎరువుల ఉత్పాదన 1986_87 లో 7.07 మిలియను టన్నులు అయింది. ఎరువుల వినియోగం 1 మిలియను టన్నుల నుంచి 8.8 మిలియను టన్నులకు పెరిగింది. ఆహారధాన్యాల ఉత్పత్తి రెట్టింపు కంటే అధికంగా 150 మిలియను టన్నులకు పెరిగింది. ఆహార ధాన్యాల దిగుమతి 10.4 మిలియను టన్నుల నుండి శూన్యానికి దిగింది.

* * *

## ట్రాక్టర్లను ఉత్పాదించే ప్రధాన దేశాలలో భారతదేశం కూడా ఉంది:

ప్రపంచంలో ట్రాక్టర్లు ఉత్పాదించే ప్రధాన దేశాలలో నేడు భారతదేశం కూడా ఉంది. 1987_88 లో 90 840 ట్రాక్టర్లతో ఉత్పాదన రికార్డు స్థాయిని అందుకుంది. 1985_86 లో భారతదేశం 345 ట్రాక్టర్లను ఎగుమతి చేసి 196 లక్షల విదేశీమారక ద్రవ్యాన్ని గణించింది.

* * *

## ఇఇసి దేశాలలో 15.6 మిలియను మంది నిరుద్యోగులు:

ఆగస్టు 1988 కి 12 యూరోపియన్ కమ్యూనిటీ (EEC) దేశాలలో అధికార పూర్వకంగా నమోదు చేయబడిన నిరుద్యోగుల సంఖ్య 15 6 మిలియను. అన్ని EEC దేశాలలోను నిరుద్యోగులైన మహిళల సంఖ్య పురుషుల సంఖ్యను మించే ఉంది.

## 20 ఆదిమ జాతులకు చెందిన పూర్వీకులు - మాయా జాతి



ఇప్పుడు మెక్సికో, బ్రిటిష్ హోండురాస్, ఎల్‌సాల్వడార్, గౌటెమాలా, నికరాగువా ప్రదేశాలు చేరిన మధ్య అమెరికా ప్రదేశాలలో ముఖ్యంగా 20 ఆదిమజాతులకు చెందిన పూర్వీకులే 'మాయాలు'. వారు నిర్మించిన పెద్ద పెద్ద స్మారక భవనాలు దట్టమైన అడవులలో ఉన్నాయి. వీటిలో మెక్సికో యుకాటాన్ పెనిన్‌సులాలో చిచెన్ ఇట్జా దగ్గర 70 అడుగుల ఎత్తైన ఎల్ కాస్టిల్లో పిరమిడ్ ఒకటి. 500 బిసిలో ప్రారంభమైన వీరి నాగరికత 8,9 AD శతాబ్దాలనాటికి ఉచ్చస్థాయిని అందుకుంది. తరువాత 16 వ శతాబ్దంలో స్పానిష్ దాడుల ఫలితంగా ఇది అంతరించిపోయింది. ఆనాడు చెట్ల బెరడుతో తయారైన వారి మూడు మాత్రమే నశించకుండా ఉన్నాయి.

"ఆనందాన్ని రెండింతలు చేసేది, దుఃఖాన్ని సగానికి తగ్గించేది స్నేహమే."

# లుగులో "ఒకతి"

సీతా రవిచంద్రన్

ఏ భాషకైనా శబ్దజాలం ఉంటుంది. శబ్దజాలం లేకుండా భాష అభివృద్ధి పొందదు. భాషా విషయంగా ఏ మానవ సమాజానికి కూడా స్వయంసమృద్ధతా, స్వయం సంపూర్ణతా అసంభవం. ప్రపంచంలో భాషలన్నీ అన్యోన్యాశ్రయాలుగా వృద్ధిపొందుతాయి. నూటికి నూరు పాళ్ళు స్వచ్ఛమైన భాష ఉండదు. ప్రతీ భాషమీద ఇతర భాషల ప్రభావం కొద్దో గొప్పో కనిపిస్తూనే ఉంటుంది.

తెలుగులో ముఖ్యంగా ఏర్పడిన పదాలు తత్సమము, తద్భవము, దేశ్యము, దేశ్యేతరము, గ్రామ్యము అని అనేక విధాలుగా ఉన్నాయి. మాతృభాష అనుకునే సంస్కృత శబ్దాల యొక్క మరియు ప్రాకృత శబ్దాలయొక్క దీర్ఘాలను, విసర్గలను శాస్త్రసమ్మతంగా మార్చుకుని లింగ[భే]దాలను బట్టి విభక్తి ప్రత్యయాలు చేర్చడం [వ]ల్ల తత్సమ పదాలు ఏర్పడ్డాయి. సంస్కృతం నుంచి గాని, ప్రాకృతంలో నుంచి గాని పుట్టిన భాష తద్భవము.

శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము మధ్య ఉండే త్రిలింగ దేశంలో వాడుకునే భాష త్రిలింగం. అదే తెలుంగు లేక తెనుగు. దేశ్య వ్యవహార సిద్ధమైన భాష దేశ్యము ఇదే మూలమాతృక నుంచి విసర్గంగా సంక్రమించిన పదజాలం.

లక్షణ విరుద్ధంగా ఉండి వ్యాకరణ సూత్రాల చేత సాధువనిపించుకోక పోయినా గ్రంథాలలో ప్రయోగింపబడే భాష గ్రామ్యము. సమీపంగా ఉండే సజాతీయ భాషలనుంచి, పరిసర విజాతీయ భాషల నుంచి మత, సాంఘిక, వాణిజ్య రాజకీయ సాంస్కృతికాది సంబంధాల మూలంగా ప్రత్యక్షంగా, పరోక్షంగా వచ్చి చేరిన పదాలు దేశ్యేతర పదాలు.

ఈ విధంగా పదజాలం వల్ల భాష సుసంపన్నమై ఆయా కాలాలకు అనువుగా వ్యావ

## ప్రపంచంలో మిక్కిలి లోతైన సరస్సు



సోవియెట్ యూనియన్‌లోని సైబీరియాలో లేక్ బైయికాల్ ప్రపంచంలో మిక్కిలి లోతైన సరస్సు. దీని లోతు ఒక కిలోమీటరుపైన 11 మీటర్లు. నదులు దీంట్లోకి ప్రవహిస్తాయి. ఒకే ఒ నది అంగారా ఈ సరస్సులో నీటిని బయట ... ది. ఇంకేవరి ఇందులో ఉండే బైయికాల్ న ... చేయడానికి 50 ... తుంది.

"పొగడేటప్పుడు ఎవరిని పొగడినా దూషించేటప్పుడు ఎవరిని దూషిస్తున్నావో జాగ్రత్తపడాలి."

హారికంగా భావప్రకటనావశ్యకాలను నిర్వ
ంచుకోడానికి సమర్థంగా ఉంటుంది.

తెలుగులో ప్రాచీనకాలంలో తత్సమ ద్భవ పదజాలాలు అధికంగా చేరాయి. మహమ్మదీయుల పరిపాలనా కాలంలో అర క్, పర్షియన్ పదాలు తెలుగు రాజకీయ, సాంఘిక రంగాలలో వ్యవహారంలోకి చ్చాయి. ఆ తరువాత వరుసగా పోర్చుగీసు, ఇంగ్లీషు మొదలైన యూరోపియన్ భాషల ప్రభావం తెలుగుపై ఎక్కువగా ఉంది.

18 వ శతాబ్దం నాటికి ఈస్టిండియా ంపెనీవారు తమ అధికారాన్ని తెలుగు దేశంలో నెలకొల్పారు. ఆంగ్లేయులు వైజ్ఞానిక, సాంస్కృతిక, సాంఘిక రంగాలలో అనేక మార్పులు తెచ్చారు. దీని ఫలితంగా ఇంగ్లీషు పదాలనేకం తెలుగులో ప్రవేశించాయి.

ఇంతేగాక విశ్వవిజ్ఞానాన్ని తమ సంస్కృతిలో ఇముడ్చుకోవాలనే అభిలాషతో ఎన్నెన్నో భాషలనుంచి ఆ యా యుగాలలో అనేక సైన్సు పదాలు, సాంకేతిక పదాలు తెలుగులోకి ఎరువు తెచ్చుకోబడ్డాయి.

తెలుగు నుడికారము మృదుమధురము, భావగర్భితము ఎన్నెన్నో సంస్కృత పదాలను తనలో జీర్ణించుకుంది. అయినా విందు తనానికి లోటు తెచ్చుకోలేదు ప్రతిభను, పోగొట్టుకోలేదు. సంస్కృత భాషా పదాలను తనలో సంలీనం చేసుకుని మూల పదాల అర్థాలకు భిన్నంగా మరింత శోభతో, పరువంతో అవతరించింది. ప్రపంచంలో ఏ శబ్దాన్నైనా తనలో జీర్ణింప చేసుకోగల శక్తి, ఏ శబ్దాన్నైనా ఉచ్చరించగలిగే శక్తి తెలుగు భాషకు అధికంగా ఉంది. ఈ విధం సంస్కృత భాష సొంపు, విదేశీ భా వాసన, దేశభాషల ఇంపు, వివిధ పద మాధుర్యం. ఇరుగుపొరుగు భాషల అ యాలు అన్నీ చేరిన భాష తెలుగుభాష.

ఇటువంటి భాషలో దేశ్యం 'ఒక అంటే 'ఒక' శబ్దానికి మహత్యర్థక రూప ఒక స్త్రీ అని అర్థము. ఈ ఒకతి అనే ప వికి తెలుగు రూపాంతరములు ఒక్క రెండా!

(మిగతా 32 వ పేజీలో)

## తిరువళ్లువర్ సూక్తులు




యశస్సును ఆశించక ఐశ్వర్యం కోస ఆరాటపడే వాని జన్మ భూమికి భారము.

* * *

దారిద్ర్యం అనే దౌర్భాగ్యంతో అనే దురవస్థలు బయలుదేరతాయి.

* * *

దొంగిలించాలనే కోరిక కలిగినప్పుడ అనంతకోటి ఇబ్బందులు ఏర్పడతాయి.

* * *

దురహంకారం లేకపోవడం గొప్పతనం దురహంకారం తీవ్రమైతే నైచ్యం.

# నెమ్మదిగా ఉండండి

వినోద్ శబర్‌వాల్

...తమంది కోపంవస్తే తుఫాను రేగినట్టు చెలరేగిపోతారు. ఒక్క 5 నిమిషాల ...పోద్రేకంలో 8 గంటల పనికి వినియో...ంచే శక్తి సామర్థ్యాలను వృథా చేసు...ంటారు కోపతాపాలవల్ల శరీరం మీద ...తో ఒత్తిడి ఉంటుంది. కోపం శీలో ...తికమైన మార్పులు కలిగిస్తుంది. రక్తం ...క్కువగా కాళ్ళలోకి, చేతులలోకి ప్రవహిస్తుంది. శారీరకంగా బలం ఏర్పడుతుంది గుండెదడ ఎక్కువగా ఉంటుంది. జీర్ణశక్తి స్తంభించిపోతుంది. మెదడుకి రక్త ప్రసారం ...ందదు దాంతో అది శక్తిహీనం అయిపోతుంది. కాబట్టి ఓర్పు పోగొట్టుకుని శాంతం లేకుండా చేసుకుంటే శరీరంలో ఎంతో నష్టం ఏర్పడుతుంది. అనర్థాలు సంభవిస్తాయి.

కోపం అత్యధిక స్థాయిని అందుకుంటే మంచి చెడ్డలు తెలియకుండా అజాగ్రత్తగా వదరుతావు. శాంతంగా ఉన్నప్పుడు నీవు చెప్పకూడదనుకున్న విషయాలన్నిటినీ వెల్లడి చేస్తావు. అందుకే కోపంవల్ల మతి చెడిపోతుంది; గౌరవం, మర్యాద పోతుంది. ఏ... లేకుండా నెమ్మదిగా ఉండాలంటే సాయంకాలం ఇంటికి వెళ్ళగానే హాయిగా

(31 వ పేజీ తరువాయి)

ఒకరిత, ఒకర్త, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక, ఒకారిత, ఒకార్త, ఒకార్తు, ఒకార్తుక, ఒకాత, ఒకాతుక, ఒక్కరిత ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత ఒక్కతుక, ఒక్కొరిత, ఒక్కొర్త, ఒక్కొర్తు, ఒక్కొర్తుక, ఒక్కొత, ఒక్కొతుక, ఒకరిత, ఒకర్తి, ఒకతి, ఒకారితి, ఒకార్తి, ఒకాతి, ఒక్కరితి, ఒక్కర్తి ఒక్కతి, ఒక్కొరితి, ఒక్కొర్తి, ఒక్కొతి, ఒకరితె, ఒకర్తె, ఒకతె, ఒకారితె, ఒకార్తె ఒకాతె, ఒక్కరితె, ఒక్కర్తె, ఒక్కతె, ఒక్కొరితె, ఒక్కొర్తె, ఒక్కొతె, ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక - 52 పదాలు ఉన్నాయి

ఇన్ని రూపాలతో అవతరించిన 'ఒకతి' తెలుగులో ఒక స్త్రీ ఏదో రూపంలో ఎక్కడో అక్కడ ఏదో కావ్యంలో ప్రత్యక్షమవుతూనే ఉంది. తెలుగు భాషా యోషకు ఇంపు సొంపుకలిగించే ఈ 'ఒకతె' ఇన్ని రూపాలతో తెలుగు వాఙ్మయంలో ముసిముసి నవ్వులు విరజిమ్ముతూంది. ఇవన్నీ రూఢ్యర్థ పదములే గాని అన్యార్థమిచ్చేది గాని, దురర్థమిచ్చేది గాని, అపార్థమిచ్చేది గాని ఒక్కటీ లేదు. ఇదే తెలుగు సంస్కృతి.

...తువుని నిరాకరించడం కాదు, హేతువును అధిగమించడమే ఆధ్యాత్మికత.

డా. ఎస్. రాధాకృష్ణ

నిశ్చింతగా పడుకుని శ్రమ తీర్చుకో. మంచి పద్యం పాడుకో, స్తోత్రం చేసుకో. శాంతి కలిగించుకోడానికి స్తోత్రం ఎంతో సహకరిస్తుంది.

ఎన్ని ఇబ్బందులు వచ్చినా నిమ్మకు నీరెత్తినట్లు ఉండాలి. భయపడిపోకు. అన్నీ వాటంతట అవే సర్దుకుంటాయి. కష్టాలను నీవు ధైర్యంగా ఎదుర్కోలేక పోలేవు.

మనశ్శాంతి ఏదో ఒక నిమిషంలో లభించేదికాదు. కొన్ని సంవత్సరాలపాటు సాధన చేస్తేనే లభిస్తుంది. నీ భావాలను నీవు పరిశీలించుకో. నిన్ను నీవు తెలుసుకో. ఆత్మ నిగ్రహానికి నిన్ను నీవు తెలుసుకోవడం ముఖ్యం. నీకు కలిగే ఒత్తిడులను వివేకంతో తగ్గించుకో. కోపం ఆవహిస్తే వివేకం పోతుంది.

ఇంట్లో ఎవరిమీదైనా కోపంతో చెలరేగిపోతే ముఖం ముడుచుకు కూర్చోకు. చిరునవ్వుతో, చమత్కారాలతో, హాస్యంతో ఒత్తిడిని తగ్గించుకో

యూరప్‌లో ఒక మహిళ 'ఫ్రస్టేషన్ రూమ్' అని గాజు పలకలతో ఒక గదిని నిర్మించి, దాంట్లో పింగాణి గిన్నెలు, కప్పులు పెట్టింది. ఎవరైనా కొద్దిగా పైకం చెల్లించి వాటిని పగులగొట్టి కోపాన్ని చల్లార్చుకోవచ్చు.

అయితే బాగా కోపంతో ఉన్నప్పుడు ఇంట్లోగాని, ఆఫీసులోగాని వస్తువులను పగులకొట్టకు. పుస్తకాలను గిరాటువేయకు. దానిబదులు దోట్లో త్రవ్వడం, కాలవగట్లన నడవడం నేర్చు[illegible] స్నేహితుల వెడుతూండు. ఇవేవీ వీలుపడలేదంటే నెమ్మదిగా దైవ ధ్యానం చేసుకో.

కోపంవల్ల వచ్చే అనర్థాలను గ్రహించి అనుభవం ఉన్నవాళ్ళు సమస్యను నెమ్మదిగా ఆలోచిస్తే దానంతట అదే సర్దుకుపోతుంది అని చెబుతారు.

—'వెస్టనర్' సౌజన్యంతో

## ఎలా?

### సోపు ఎలా శుభ్రం చేస్తుంది?



సోపు మాలిక్యూలలో కార్బను, హైడ్రోజన్, ఆక్సిజన్ అణువులు ఉంటాయి. ఇవి ఒక పాము ఆకారంలో అమరి ఉంటాయి. ఆక్సిజన్ తలవైపు, హైడ్రోజన్, కార్బన్ తోకవైపు ఉంటాయి. ఎలక్ట్రికల్‌గా చార్జి అయిన ఆక్సిజన్ 'తలను' నీరు ఆకర్షిస్తుంది. ఎలక్ట్రికల్‌గా తటస్థంగా ఉన్న హైడ్రోజన్, కార్బన్ ఉండే తోకభాగం మురికిలో ఉండే నూనెను ఆకర్షిస్తాయి. [illegible]లు కడుక్కునేటప్పుడు నీటి [illegible] సోపు మాలిక్యులు తలలను [illegible]యి. అప్పుడు హైడ్రోజన్, [illegible] మురికి విడిపోతాయి.

'ఆధ్యాత్మిక తత్త్వానికి, ఆరోగ్య సూత్రాలకు [illegible] అవినాభావ సంబంధం.''

# విజ్ఞానవేదిక

## శరీరపోషణ

పోషణ (న్యూట్రిషన్) అంటే శరీర ఆరోగ్యము మరియు పెరుగుదలకు సంబంధించిన ఆహార విజ్ఞానం. శరీరాన్ని ఆరోగ్యవంతంగా నిలబెట్టుకోడానికి సక్రమమైన ఆహారం తినడం చాలా ముఖ్యం. సమతూకపు ఆహారంలో శరీర ఆరోగ్యానికి అవసరమైన పోషకాంశాలన్నీ లభిస్తాయి



మనం తినే ఆహారంలో శరీర ఆరోగ్యాభివృద్ధికి అవసరమైన వస్తుభాగాలనే పోషకాంశాలు అంటారు.

శరీరంలో ఎముకలు మరియు వివిధ కండరాల అభివృద్ధికి ప్రోటీనులు అవసరం. ఇవి పాలు, బటాణీలు, చిక్కుడు మొదలైన వాటిలో లభిస్తాయి.

పిండి పదార్థాలు, చక్కెర ఉండే కార్బోహైడ్రేటులు శక్తిని సరఫరా చేస్తాయి. రొట్టె, బంగాళదుంప మరియు పప్పుధాన్యాల నుండి పిండిపదార్థాలు లభిస్తాయి. పంచదార మరియు కొన్నిరకాల పళ్ళు, కాయగూరల నుంచి చక్కెర లభిస్తుంది.

క్రొవ్వు పదార్థాలు కూడా పుష్టిని ఇస్తాయి. పాలు, జీడిపప్పు, బాదంపప్పు వగైరాలలో క్రొవ్వు ఉంటుంది.

పునర్నిర్మాణానికి, అభివృద్ధికి శరీరం వినియోగించుకునే వస్తువులే ఖనిజాలనే రసాయనిక పదార్థాలు. కాల్షియం ఎముకలలో ముఖ్యభాగము రక్తాభివృద్ధికి ఇనుము అవసరం.

శరీరానికి అత్యవసరమైన పోషకాంశాలు విటమినులు. వీటిని శరీరం దానంతట అది పొందలేదు. శాస్త్రయుక్తమైన వీటిపేర్లు చాలా పెద్దవి. అందుచేత విటమినులకు A,B,C,D,E,K అనే పేర్లు పెట్టారు. తినే ఆహారంలో ఈ విటమినులలో ఏదిలోపించినా విటమిను కొరతవల్ల సంభవించే వివిధ రోగాలు సంభవిస్తాయి

విటమిను లోపంవల్ల కలిగే రోగాలలో ఒకటి స్కర్వీ. తినే ఆహారంలో విటమిను

(మిగతా 35 వ పేజీలో)

### ప్రమాణము

అచ్చువేసిన ఒక చిన్న అక్షరం, రసాయనిక చర్యలో పాల్గొనే మూలపదార్థపు మిక్కిలి చిన్నభాగమైన అణువుకంటే 10 బిలియను (10,000 మిలియను) రెట్లు పెద్దదిగా ఉంటుంది. కాని భూమి ఆ అక్షరం కంటే 10 బిలియను (10,000 మిలియను) రెట్లు పెద్దది.

“ఇంట్లోనే యజమానుడుంటాడు,

# సుఖసంతోషాలకు మార్గం

మా యోగ శక్తి

హిందీలో "కమ్ ఖావో, గమ్ ఖావో" అనే లోకోక్తి నాకు చాలా ఇష్టం. అంటే 'మితంగా తిను", "విచారాన్ని మ్రింగు". ఆహారాన్ని నియంత్రించుకో. నీ మనోవికారాలను నియంత్రించుకో. అప్పుడే



ప్రపంచంలో అందరికంటే ధనికుడవు అవుతావు.

మనం తినేదానివల్ల మనకి ఆయురారోగ్యాలు సంభవిస్తున్నాయని చాలామంది దురభిప్రాయ పడుతున్నారు. కానీ తినడం ఆరోగ్యానికి, సుఖసంతోషాలకు ముఖ్యం కాదు. మనం మితంగా తినాలి. శరీరానికి అవసరమైనంత తినాలి. సహజమైన మరియు కృత్రిమమైన అవసరాలను గుర్తించుకోవాలి. సాధారణంగా శరీరానికి కాదు మనస్సుకే తినడం అవసరం. మనం అధికంగా తింటే జీర్ణకోశం చెడిపోతుంది. మానసిక విధానం నిరసించిపో మనకు ఎంత అవసరమో అంతే ఆపే తీసుకోవడానికి హక్కు ఉంది. గమ్ ఖావో అంటే నీ మనో భావాలను దిగమ్రింగు. ఉద్రేకం చెందిపోకూడదు. ఎప్పుడూ దుఃఖంతో ఉండవద్దు. పగ తీర్చుకోడానికి తలపెట్టకు. ప్రతీకార భావాన్ని పోగొట్టుకో. మొట్టమొదట మనస్సు ప్రతిక్రియకు ఉపక్రమిస్తుంది. ప్రతిక్రియను నిరోధించు. గుర్రాలను నిగ్రహించడానికి కళ్ళాలుంటాయి; శక్తివంతమైన మనస్సును నిరోధించడానికి కూడా కళ్ళాలు ఉండాలి. ఎవరైనా ఆ కళ్ళాలను లాగుతూండాలి. ఆ ఎవరో నీవే. మనస్సును చంచలంచేసుకోక నిలకడగా ఉంచుకో.

శరీరానికి ఏది ఎంత అవసరమో అది ఇవ్వాలి. అంతకంటే ఎక్కువగా ఇవ్వకూడదు. మనస్సుకు కావలసిన శిక్షణను ఇచ్చి నిరోధించుకోవాలి. ఆరోగ్యానికి, సుఖానికి రెండే రెండు ప్రాతిపదిక కారణాలు ఉన్నాయి. మితంగా తిను, భావాలను నియంత్రించుకో.

---

(34 వ పేజీ తరువాయి)

C లోపించినప్పుడు స్కర్వీ సంభవిస్తుంది. విటమిను C ముఖ్యంగా తాజాపళ్ళలోను వివిధ రకాల కాయగూరలలోను పుష్కలంగా ఉంటుంది. తాజా నిమ్మరసంలో విటమిను C అధికంగా ఉంటుంది. కాబట్టి అవి త్రాగితే స్కర్వీ నివారించుకోవచ్చని 1753 లో జేమ్సులిండ్ అనే స్కాటిష్ డాక్టరు చెప్పాడు. ఇదే న్యూట్రిషన్ లేక పోషణకు ప్రారంభం.

---

"లక్షాధికారైనా లవణమన్నమె గాని
మెరుగు బంగారమ్ము మ్రింగబోడు."

# అవీ-ఇవీ

**అనేక శతాబ్దాలుగా రెన్నెల్ ద్వీపం విడిగా ఉండిపోయింది:**

పసిఫిక్ మహాసముద్రం నైఋతి దిక్కుగా సోలమన్ ద్వీపాలలో రెన్నెల్ అనే చిన్న ద్వీపం వర్షాధారమైన అడవులతో నిండి ఉంది. అనేక శతాబ్దాలనుండి ఇతర



సంబంధం లేకుండా విడిగా ఉండిపోయింది. రెన్నెల్‌లో నివసించే 50 జాతుల పక్షులలో 21 జాతులు చాలా అపూర్వమైనవి అని రెయిన్ ఫారెస్ట్ ఆక్షన్ నెట్‌వర్క్ వారి సమాచారం. వృక్ష శాస్త్రజ్ఞులు ఇంకా ఇక్కడ పరిశోధించకపోయినా వృక్ష సంపదలో 40 శాతం ప్రత్యేకంగా ఈ ద్వీపానికి చెందినవే అని అంచనా।

—'సిఇఇఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో.

* * *

**'వెస్ట్‌పాకెట్' అణు విద్యుత్ ఉత్పాదక కేంద్రము:**

అణు విద్యుదుత్పాదక కేంద్రాలను రూపొందించి నిర్మించుటలో నిపుణులైన పశ్చిమజర్మనీ కంపెనీలు 15 మరియు 30 మధ్య మెగావాట్ల శక్తితో 'వెస్ట్‌పోకెట్' (Vest pocket) కేంద్రాలను నిర్మించడానికి ప్రణాళికలు ఏర్పరచుకున్నాయి. చిన్న తరహా ప్లాంటుల భద్రతవల్ల, నిర్వహణ సౌలభ్యతవల్ల ఇవి ప్రత్యేకంగా అభివృద్ధి పొందుతూన్న దేశాలకు చాలా అనుకూలంగా ఉంటాయి. వెస్ట్ ఫాలియాలో 'హామ్' వద్ద' దీని ఆధారంగా నిర్మించిన జర్మన్ HTR 300 హై టెంపరేచర్ రియాక్టరు నవంబరు 1985 నుంచి 2.2 బిలియను కిలో

## సుభాషితాలు

బాట తెలియకున్న బహుదూరమైతోచు
చోటు తెలియకున్న చూపొనరదు
కోటకొమ్మమీద కుదురుగా చూడరా
విశ్వదాభిరామ వినుర వేమా।

[మార్గం తెలియనప్పుడు గమ్యస్థానం దూరం అనిపిస్తుంది. చూడవలసినది తెలియకపోతే చూపు ఆనదు. కాబట్టి నీలో ఉండే పరమాత్మను తెలుసుకోటానికి యత్నించు, కృతార్థుడవు అవుతావు.]

* * *

కపటమైన పనులు కడబెట్టి చూడక
తత్త్వమెట్లు తనకు దగులువడును
తగులు వడినగాని ధన్యత నొందడు
విశ్వదాభిరామ వినుర వేమా।

[మోసకారితనాన్ని విడిచిపెడితే గాని అసలు తత్త్వం తెలియదు. తత్త్వం తెలిసే గాని (మానవుడు) కృతా

'కుటుంబము కొరకు శ్రమపడుట వేరు,
కుటుంబము కొరకు శ్రమపడుతున్నానని అనుకొనుట వేరు.'

వాట్ పవరుల విద్యుచ్ఛక్తిని నేషనల్ గ్రిడ్‌కి సరఫరాచేసింది. సామాన్యంగా రోజుకి చిన్న చిన్న గులకరాళ్ళలాంటి 600 ఫ్యూయెల్ ఎలిమెంటులను వినియోగిస్తుంది.

—'జర్మన్ ఫీచర్స్' సౌజన్యంతో

* * *

### ప్రపంచంలో మిక్కిలి మధురాతి మధురమైనది:

పశ్చిమ ఆఫ్రికా వర్షధారపు అటవీ ప్రదేశాలలో లభ్యమయ్యే ప్రోటీను సంబంధమైన వస్తువు థేమాటిన్ (Thaumatin) ప్రపంచంలో మిక్కిలి మధురాతి మధురమైన వస్తువు.

* * *

### భారతదేశంలో 508 టన్నులకు పైగా బంగారం:

మార్చి 1987 నాటికి భారతదేశంలో రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, మింటులలో (mints ను మరియు ప్రభుత్వం వారికి డిక్లేర్ చేసిన బంగారం మొత్తం 508.734 టన్నులు ఉంది.

* * *

### పట్టాలకు తగలకుండా నడిచే పాసింజరు కారు:

యుఎస్ఎస్ఆర్‌లో ట్రాన్స్‌పోర్టేషన్ రీసెర్చి సంస్థ పట్టాలకు తగలకుండా నడిచే పాసింజరు కారును రూపొందించడానికి ఉద్యమాలను కొనసాగిస్తున్నారు. మూడు ఫేజుల ఇండక్షన్ మోటారుతో అడుగు నడపడానికి వీలవుతుంది. యుఎస్ఎస్ఆర్ మాస్కోలో, ప్రదేశంలో కొంత శక్తితో నడిచేసే ఈ కారుమీద ప్రయోగాలు చేస్తున్నారు.

## పరిసర వాతావరణ కాలుష్యాలను తెలుసుకోడానికి తేనెటీగల సహాయం



యుఎస్ఏ మోంటానా యూనివర్శిటీలో శాస్త్రజ్ఞులు తేనెటీగల సహాయంతో పరిసర వాతావరణంలో కాలుష్యమైన పరిస్థితులను తెలుసుకోడానికి సాధ్యాసాధ్యాలను అధ్యయనం చేస్తున్నారు. తేనెటీగలు మకరందాన్ని సేకరించేటప్పుడు ఫ్లోరైడ్ యౌగికాలు, సీసము, రాగి, కాడ్మియం, మరియు ఆర్సెనిక్ వంటి భారలోహాలు (heavy metals), మరియు రేడియో ధార్మిక పదార్థాలను కూడా సంగ్రహిస్తాయి. కాలుష్యాలను కలిగించే రసాయనిక వస్తువుల ఉనికిని కనిపెట్టడానికి తేనెటీగల టిస్యూ కణాలను సరుసగా విశ్లేషణ పరీక్షలతో గుర్తిస్తారు. దీనివలన ఒక బిలియన్ (1000 మిలియన్) భాగంలో ఒక భాగమంత అతి తక్కువ కాలుష్యకారక వస్తువులను తెలుసుకోవచ్చు

— పిఐబి-ఎన్ఎఫ్ఎస్

"చేతనైనవాడు చేస్తాడు, చేతకానివాడు ఉపదేశిస్తాడు."

### విగ్గులతో అలంకరింపబడిన ఈజిప్టు మమ్మీలు కనుగొనబడ్డాయి

విగ్గులతో అలంకరింపబడిన సుమారు 4,000 సంవత్సరాలకు పైబడిన పురాతన ఈజిప్షియన్ మమ్మీలు కనుగొనబడ్డాయి. విగ్గులు ధరించే ఫాషన్ యూరోపియన్ దేశాలలో 17 వ శతాబ్దంలో ప్రారంభమైంది. బట్టతలగల ఫ్రాన్స్‌రాజు 13 వ లూయీ విగ్గు పెట్టుకోడం ప్రారంభిస్తే అందరూ దానిని అనుకరించారు.

* * *

### ఎలక్ట్రానిక్ వాచ్‌మన్!

పశ్చిమ జర్మనీలో ఒక కంపెనీ అభివృద్ధి చేసిన ఎలక్ట్రానిక్ వాచ్‌మన్‌కి డిటెక్టర్ ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డు ఉంటుంది. దీనికి ఒక ప్లాస్టిక్ పెట్టెలో అమర్చిన ఇంధనం సరఫరా అవుతుంది. అతి సౌలభ్యంగా అమర్చుకోగల తేలికైన ఈ అలారం ప్రత్యేకంగా నాలుగు గ్రూపులకు (సాబొటేజ్ అలారం, ఇంట్రూడర్ అలారం, ఇంటర్నల్ అలారం, బర్గలర్ అలారం) అమర్చుకోవచ్చు.

* * *

### దూరాన్ని సూచించే అల్ట్రాసోనిక్ సాధనం

ఒక పశ్చిమ జర్మనీ కంపెనీ శబ్దాతీతమైన అల్ట్రాసౌండ్ సాధనాన్ని అభివృద్ధి పరచింది. ఇది ఒక కారు మరియు బాహ్య వస్తువుల మధ్య దూరాన్ని సూచిస్తుంది. ఆ దూరం 50 సెం.మీ. కంటే తక్కువగా ఉన్నప్పుడు అలారం కొడుతూ ఎర్రదీపాన్ని చూపిస్తుంది. సెన్సార్స్ మరియు మైక్రో ప్రోసెసర్‌తో పనిచేసే ఈ అపూర్వసాధనం కారు రివర్స్ లైట్‌లో అమర్చబడి ఉంటుంది.

* * *

### ఆఫ్రికా ఏనుగులు అంతరించిపోతున్నాయి

దంతపు వర్తకులు దంతంకోసం ఏనుగులను చంపుతూండడంవల్ల ఆఫ్రికా ఏనుగులు పూర్తిగా అంతరించిపోయే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. 1970 లో ఏనుగు దంతం కి.గ్రా. 5 డాలర్లు. నేడు వేలంలో కి.గ్రా.కి 147 డాలర్లు వస్తూంది.

### నాస్తికుడు ఆస్తికుడైపోతాడు




1929 లో లండన్ నగరంలో గొప్ప రచయిత జార్జి బెర్నార్డ్‌షా సమ్మోహనాత్మకమైన ఎహూదీ మెనూహిన్ సంగీతం వింటూ 'ఎహూదీ వంటి కళాభిజ్ఞుని అపూర్వ సంగీతం వింటే నాస్తికుడు కూడ [illegible] ఆస్తికుడైపోతాడు' అన్నారు.

**శక్తిలేని వ్యక్తి, వ్యక్తిలేని శక్తి నిరుపయోగము.**

# మిక్కిలి ఎత్తైన భవనాలు

జపాన్ ఐకెబుకురో (Ikebukuro) లో ఉన్న మిక్కిలి ఎత్తైన భవనం 'సన్ షైన్ 60' టోకియోలో ఎక్కువ సందడిగా ఉండే షాపింగ్ మరియు వ్యాపార కేంద్రము. 240 మీటర్ల ఈ గోపుర నిర్మాణానికి 60 అంతస్థులు ఉన్నాయి.



సింగపూర్‌లో 61 అంతస్థుల 280 మీటర్ల ఎత్తైన ఓవర్‌సీస్ యూనియన్ బాంక్ భవనం ఇప్పుడు ఆసియాలోనే మిక్కిలి ఎత్తైనది. సుప్రసిద్ధ జపాన్ ఆర్కిటెక్ట్ కెంజో టాంగె (Kenzo Tange) దీని నిర్మాత. ఆసియాదేశపు పెద్ద ఆర్థిక కేంద్రాలలో ముఖ్యమైన సింగపూర్‌లోని ఈ భవనం ముక్కోణపు ఆకారంలో నిర్మింపబడింది.

కౌలాలంపూర్‌లో మెనారా మేబాంక్ (Menara Maybank) బ్రహ్మాండమైన భవనం. 230 మీటర్ల ఎత్తుగల ఈ భవనానికి 58 అంతస్థులు ఉన్నాయి. భవనం సాంప్రదాయక మలయా యోధులు ఉపయోగించే క్రిస్ (బాకు) ఆకారంలో నిర్మింపబడింది.

ఇండోనేషియా ముఖ్య రాజధాని నగరమైన జకార్తాలో ది బాంక్ బూమి దయా భవనం 'Jl. ఇమామ్ బొంజల్ 61' చాలా ఎత్తైనది దీనికి 32 అంతస్థులు ఉన్నాయి.

ఆస్ట్రేలియా మెల్‌బోర్న్‌లో రియాల్టో (Rialto) వీధి మట్టానికి 242 మీటర్ల ఎత్తుగా ఉంటుంది. ఇది దక్షిణ భూభాగం (Southern Hemisphere) లో మిక్కిలి ఎత్తైనది. ఇక్కడ రెండు టవర్లలో 43 మరియు 56 అంతస్థులు ఉన్నాయి. దీని గాజు తెర పగటిపూట వివిధ రంగుల్లో కనిపిస్తుంది.

థాయ్‌లాండ్ రాజధాని నగరం బాంగ్‌కాక్‌లో మిక్కిలి ఎత్తుగా ఉండే షాపింగ్ సెంటరు బయోక్ (Baiyoke) కాండోమినియమ్. ఇది 39 అంతస్థులతో మిక్కిలి సుందరమైన నిర్మాణం.

న్యూజిలాండ్ రాజధాని నగరం వెల్లింగ్‌టన్‌లో చాలా ఎత్తుగా ఉండే భవనం న్యూజిలాండ్ బాంక్. 28 అంతస్థుల ఈ భవనంలో 2,000 మంది ఉద్యోగాలు చేస్తూంటారు.

"సుఖానికి ..."
దైవం చేశాడనుకోవడమే.

## మా తాత...?

(జూలై

('కవి ఎన్నుకోబడని శాసనకర్త' అంటే)

"కనుకనే కవికి కాసులు కరువై పోతాయంటా"

—కోరాడ దుర్గారావు, పెంటనాగులవలస

# కలం స్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా. హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. — సంపాదకుడు.]

1. జి. ప్రకాశ్, న్యూస్ ఏజెంటు, ప్రకాష్ బుక్ సెంటర్, మరికల్, (మహబూబ్ నగర్ జిల్లా) 509 351.

ప్రకృతి ఆరాధన, ఫొటోగ్రఫీ, జనరల్ నాలెడ్జి.

2. షేక్ అబ్దుల్ రహమాన్, 22 సం.లు., టీచరు, రవీంద్ర విద్యాలయం, గ్రామము మరియు పోస్టు వెర్లపాలెం, కోవూర్ మండలం (నెల్లూరుజిల్లా) 524 137.

ప్రకృతి ఆరాధన, దైవభక్తి, ఆధ్యాత్మిక చింతన.

3. బొమ్మెన వినోదు గౌడు, S/o బి. విద్యాసాగర్ గౌడు, గ్రామము లోనవెల్లి, సిర్పూరు (టి) మండలం, (ఆదిలాబాద్ జిల్లా) 504 299.

కవితలు వ్రాయడం, దైవభక్తి, మంచి వారితో స్నేహం.

4. ఎమ్. వెంకటేష్ 27 సం. లు., C/o శ్రీరామ్ టైలర్స్, పరాక్స్ సొసైటీ, జి. ఆర్. కటార్‌గామ్ రోడ్, సూరత్ - 395 004.

విజ్ఞాన విషయాలు తెలుసుకోవడం, రేడియో వినడం, విజ్ఞాన పత్రికలు చదవడం.

5. ఎ. నాగభూషణం, ఇంటర్ రెండవ సంవత్సరం, 20 సం.లు., S/o ఎ. నారాయణ, ఇం. నెం. 18-3-5, చత్రినాక, పాతబస్తీ హైదరాబాదు.

క్రమశిక్షణ, పెద్దలను గౌరవించుట, వార్తాపత్రికలు చదువుట, గ్రంథములను సేకరించుట.

## హిరోషిమా అణు విస్ఫోటనంలో 78,150 మంది ప్రాణాలు కోల్పోయారు




6 కి.గ్రా.లు యురేనియం 235 కలిగి మొట్టమొదటి అణుబాంబు జపానుకు హిరోషిమా మీద వేయబడింది. హిరోషిమా నగరం జనాభా ఆగస్టు ... 3,38,000 మంది. ఈ బాంబు ... మంది ప్రాణాలు కోల్పోయా... మంది గాయపడ్డారు. 2,35... లేదియే

అనవసరం

లు న న

సద్వినియోగ

# జాతీయ వార్తలు

## 1987-88 లో రూ. 4000 కోట్ల విలువగల వజ్రాల ఎగుమతి:

1987-88 లో వజ్ర పరిశ్రమ రికార్డు స్థాయిలో రూ. 4000 కోట్ల విలువగల వజ్రాలను ఎగుమతి చేసింది. వజ్రాల ఉత్పాదన దక్షిణ గుజరాత్‌లో 'డైమండ్ సిటీ' అనబడే సూరత్‌లో అత్యధికం. దేశంలో మొత్తం వజ్రాల ఉత్పాదన 13,000 కారక్లే అయినా ప్రతి సంవత్సరం 48 మిలియన్ కారెట్లు దిగుమతి చేసుకుని వాటిని కోసి మెరుగుబెట్టి తిరిగి ఎగుమతి చేస్తుంది. ఇప్పుడు ప్రపంచంలో భారతదేశం ఒక పెద్ద డైమండ్ ప్రోసెసింగ్ సెంటరు. ఇజ్రేల్, బెల్జియం మెరుగుపెట్టని ముడి సరకును భారతదేశానికి పంపుతాయి.

* * *

## బ్రహ్మాండమైన ఫెర్టిలైజర్ ప్లాంట్:

ఉత్తర ప్రదేశ్‌లో జగదీశ్‌పూర్ వద్ద రూ. 740 కోట్ల వ్యయంతో బ్రహ్మాండమైన ఎరువుల కర్మాగారం ఒకటి స్థాపింపబడింది. దీనికి అవసరమైన ఇంధనము బాంబేహై నుండి సరఫరా అవుతుంది. ఇక్కడ ఉత్పత్తి కాబడే అమ్మోనియా మరియు యూరియా ఎరువులను ఉపయోగించి వ్యవసాయ రంగం 4 మిలియను టన్నులు అధికంగా ఆహారధాన్యాలు పండిస్తుంది.

* *

## భారతదేశంలో పంచదార ఉత్పత్తి అత్యధికం:

1987-88 లో పంచదార ఉత్పత్తిని 85 లక్షల టన్నులకు పెంచి భారతదేశం ప్రపంచంలో అత్యధికంగా పంచదారను ఉత్పత్తి చేసే దేశం అయింది. గ్రామీణ ప్రజలలో సుమారు 7 శాతం అంటే సుమారు 35 మిలియనుమంది చెరకు వ్యవసాయం చేస్తారు. 1987-88 లో పంచదార పరిశ్రమ రైతులకు రూ. 2,600 కోట్లు ముట్టచెప్పింది. 1987-88 లో సుమారు 94 లక్షల టన్నుల చక్కెర దేశంలో వినియోగం అయింది.

## బ్రిడ్జిని ఎప్పుడూ దాటకు



ఈ ప్రపంచంలో ప్రతి రోగానికి పరిహారం ఉండవచ్చు లేక ఉండకపోవచ్చు. ఉంటే తెలుసుకోడానికి ప్రయత్నించు, ఉండకపోతే పోనీ పర్వాలేదు. కాని నియమం పెట్టుకో. బ్రిడ్జి ప్రారంభం దాకా వస్తే గాని దాటకు. ఏమవుతుందో ఆ [illegible]

# పులి - అందమైన జంతువు

డా. కె. నారాయణన్

పులి లేక వ్యాఘ్రము పిల్లి జాతికి చెందిన పెద్ద అడవి జంతువు. ఠీవిగా నడుస్తుంది, గెంతుతుంది. నీటిలో ఈదుతుంది. ఇది చెట్లు ఎక్కలేదు. అందమైన చారలుగల ఈ పులి ఒంటరిగా జీవిస్తూ పగలు రాత్రి కూడా ఇతర జంతువులను వేటాడి తింటుంది.



సర్పాలు అన్నీ విషసర్పాలు కావు. అలాగే పులులు అన్నీ మనుష్యులను తినే పులులు కావు. బాగా కోపం తెప్పించి రెచ్చగొడితేనే తప్ప పులి మనిషిమీద పడదు. కానీ వృద్ధాప్యంవల్ల, అపాయంవల్ల, అనారోగ్యంవల్ల సహజమైన ఆహారం సంపాదించుకోలేనప్పుడు, ఒకసారి ఎప్పుడైనా మనిషి మాంసం రుచి చూచినప్పుడు వదలదు. చాలా క్రూరంగా మారిపోతుంది. పిల్లులలాగే పులికూడా మాంసాహారి. దుప్పి, అడవిపందులు, పక్షులు, కోతులు, కప్పలు, ఒక్కొక్కప్పుడు కీటకాలు ఏది దొరికితే దానిని పట్టి చంపి తింటుంది. బాగా ఆకలితో ఉన్న పెద్దపులి ఒకేసారి 45 కి.గ్రా.ల మాంసం ఇతర చిరుతి కూడా తింటుంది. ఈ విధంగా కడుపునిండుగా ఒకసారి తింటే తిరిగి కొన్ని రోజులదాకా ఆహారం ముట్టుకోదు. ఇది సాధారణంగా రాత్రిపూటే వేటాడుతుంది. ఆ సమయంలోనే లేళ్ళు, దుప్పులు విచ్చలవిడిగా తిరుగుతుంటాయి. ఆహారంకోసం వేట సూర్యాస్తమానం అయిన తరువాత బాగా సంధ్యా సమయంలో ప్రారంభమవుతుంది. పగలంతా బాగా నిద్రపోతుంది లేక కళ్ళు సగం మూసి కునికిపాట్లు తీస్తూంటుంది. వేట జంతువును రహస్యంగా పొంచుండి మీదకి దూకి చంపిన తరువాత దానిని ఒక ఏకాంత ప్రదేశానికి ఈడ్చుకు పోతుంది. అక్కడ తినగలిగినంత తిని మిగిలిన దానిని భూమిలో కప్పిపెట్టి తరువాత తిరిగి వచ్చి సావకాశంగా తింటుంది.

పులులకి కంటిదృష్టి, చెవుల శ్రవణశక్తి చాలా తీక్షణంగా ఉంటుంది. ఘ్రాణశక్తి మాత్రం తక్కువ. రాత్రిపూట బాగా చూడగలదు. ఇతర జంతువుల సందడి ఎంత చిన్నదైనా ఇట్టే వినగలదు. ఇవి కూడా పిల్లులలాగే నిశ్శబ్దంగా నడుస్తాయి. ఎండుటాకులు కంపమీద కూడా ఏ మాత్రం శబ్దం చేయకుండా అతిమృదువుగా నడుస్తుంది. అతినైపుణ్యంగా తప్పించుకు తిరుగుతాయి. అడవిలో వీటి శరీరంమీద చారలు, రంగు ఏదో నీడ, వెలుతురు లాగా కనిపిస్తుంది. అవి వాటికి రక్షకవర్ణము.

అసలు వింత ఏమిటంటే పులి అంటే మనిషికి ఎంత భయమో, పులికి మనిషి

...ము కంటకము.

...రునికి త్యాగం భయము.

అంటే అంత భయము. మనిషి పులికళ్ళ లోకి నిర్భయంగా కళ్ళు తెరచి చూస్తూంటే ఎంత భయంకరంగా అరచినా పులి మెల్లిగా నడిచి చక్కాపోతుంది. పులులు సాధారణంగా ఒంటరిగా సంచరిస్తాయి. జత కూడేటప్పుడు మగపులులు అతి భయంకరంగా ఆడుపులి కోసం కొట్లాడుకుంటాయి. ఆడది పోట్లాటలో జోక్యం చేసుకోకుండా దూరంగా ఉండి



చూస్తూంటుంది. ఇతర వాటిని అన్నిటిని తరిమేసిన తరువాత గెలిచిన పులితో చేరి జతకూడడానికి వెళ్ళిపోతుంది.

ఆడపులి పిల్లలను ఎంతో ప్రేమతో చూసుకుంటుంది. తల్లిపులి సాధారణంగా 2,3 లేక 4 పిల్లలను పెడుతుంది. వీటిలో ఒకటైనా బ్రతికి జీవిస్తుంది. పుట్టినప్పుడు పులిపిల్ల ఒక కిలోగ్రాము అంతకంటే కొంచెం ఎక్కువగా తూగుతుంది. క్రూర జంతువులనుండి జాగ్రత్తగా రక్షించుకోడానికి తల్లిపులి సాధారణంగా పిల్లలతో 3,4 సంవత్సరాలదాకా ఉంటుంది. 6 మాసాల దాకా పులి పిల్లలు పూర్తిగా తల్లిమీదే ఆధారపడి ఉంటాయి. తల్లిపులి మాంసం ముక్కలను బాగా నమిలి చిన్నవాటికి తినిపిస్తాయి. ఆరుమాసాల తరువాత జంతువులను వేటాడటం తల్లి నేర్పుతుంది. మొట్టమొదట చిన్న చిన్న జంతువులను చంపటం, తరువాత పెద్ద పెద్ద జంతువులను చంపడం నేర్పుతుంది. 3 లేక 4 సంవత్సరాలు పెద్ద అయ్యేటప్పటికి తల్లిని విడిచి స్వతంత్రంగా జీవించడానికి ప్రారంభిస్తాయి.

గత 50 సంవత్సరాలలో పులులు చాలా మటుకు మరణించాయి. ముఖ్యంగా అవి నివసించే అడవులు వ్యవసాయం కోసం కొట్టేసారు. వేలకొద్దీ పులులను వేటాడి చంపడం ధనవంతులకు ఒక అలవాటైంది. ఇప్పుడు వాటి సంరక్షణకి అడవులను పెంచుతున్నారు. ఇక్కడ అవి విచ్చలవిడిగా సంచరించి వేటాడతాయి. గత పది సంవత్సరాలలో వీటి సంఖ్య బాగా పెరిగింది. సాధారణంగా 15 చ కి.మీ. వైశాల్యంలో ఇవి సంచరిస్తూంటాయి. కాబట్టి వీటికి వేటాడే వారి నుండి ప్రత్యేక రక్షణను కలిగించడమే గాకుండా పెద్ద పెద్ద రక్షక వనాలను ప్రత్యేకించాలి. ఈ జాతి అంతరించిపోకుండా వరల్డ్ వైల్డ్ లైఫ్ ఫండ్ తీవ్రమైన చర్యలు తీసుకుంటున్నారు. ఈ చర్యలకు తగిన రీతిలో సహాయపడి ఈ జాతి అంతరించిపోకుండా చూడడం మానవ ధర్మం.

## ప్రపంచంలో మిక్కిలి చిన్న చర్చి

వాలగే నాలుగు మంది కూర్చోడానికి వీలుగా ఉండే 5 అ × 11 అ. చర్చి ప్రపంచంలో మిక్కిలి చిన్నది. ఇది యు ఎస్ ఎ మసాచూసెట్స్‌లోని హడ్సన్‌లో ఉంది

# నమ్మలేని నిజాలు

## సయామీస్ ట్విన్స్

రష్యాలో జన్మించిన సయామీస్ ట్విన్స్ (కవలలు) మాషా, దాషాలు చేరి ఉన్నా నిచ్చెనపైకి ఎక్కగలరు. సైకిల్ తొక్కగలరు.

* * *

## హఠ్యకు పాల్పడిన సర్పము

యునైటెడ్ స్టేట్స్ ఫిలడల్ఫియా జూలో 1963 లో ఒక పాము తన తోకను తానే కరచుకొని ఆత్మహత్య చేసుకుంది.

* * *

## 4,831 పచ్చబొట్లు

జో సిమ్సన్స్ అనే కెనెడియన్ యువకుడు శరీరంమీద 4,831 వివిధ పచ్చబొట్లు ఉన్నాయి.

* * *

## గంటకు 225.4 కి.మీ.లు వేగంతో సర్వ్ చేసిన టెన్నిస్ బంతి

సుప్రసిద్ధ అమెరికన్ టెన్నిస్ క్రీడాకారుడు రోస్కోటానెర్ (Roscoe Tanner) టెన్నిస్ బంతిని 225.4 కి.మీ.లు వేగంతో సర్వ్ చేసేవాడు.

## నత్త పదునైన కత్తి అంచుమీద కూడా పాకుతుంది

నత్త పదునైన మంగలి కత్తి అంచుమీద కోసుకోకుండా, ఎంతమాత్రం అపాయం లేకుండా అతి సౌలభ్యంగా ప్రాకుతుంది.

* * *

## ఫ్రాన్స్‌లో చారెంటెన్ బ్రిడ్జి

ఫ్రాన్స్‌లో చారెంటెన్-లె-పోంట్ (Charenton-Le-Pont) బ్రిడ్జి మొట్టమొదట 52 బి.సి.లో నిర్మించబడింది. ఇది అనేక సార్లు కొట్టివేయబడి 17 సార్లు పునర్నిర్మాణం చేయబడింది.

## ప్రపంచంలో అగ్నిపర్వతాలు చైతన్యవంతంగా ఉన్న ప్రదేశాలు




ప్రపంచంలో అగ్నిపర్వతాలు చైతన్యవంతంగా ఉన్న ప్రదేశాలు జపాను, ఇండోనేషియా మరియు యునైటెడ్ స్టేట్స్. యుఎస్ఎలో 58 అగ్నిపర్వతాల విస్ఫోటనాలు చరిత్రలో రికార్డు కావింపబడ్డాయి.

''శక్తిని దాచక పని చేయువాడు దొంగ.''

# టోకియో భూకంపం

సెప్టెంబరు 1, 1923న సంభవించిన భూకంపం వల్ల జపాను రాజధాని నగరమైన టోకియో భూమట్టమైపోయింది. టోకియోలో మధ్యాహ్నం 12 గంటల సమయంలో ఇళ్ళలో అనేకమంది స్టవ్‌లమీద వంటలు చేసుకుంటున్నారు. ఎక్కడో భూమిలో క్రింద శబ్దం ప్రారంభమైంది. వెంటనే భూమి మూడుసార్లు కంపించిపోయింది. ఆ తరువాత 6 గంటల దాకా ప్రతీ రెండేసి నిమిషాలకి చిన్న చిన్న కంపనలు వస్తూనే ఉన్నాయి.

మండుతూన్న స్టౌలు తల్లక్రిందులై వెంటనే ప్రతీచోటా పెద్దపెద్ద మంటలు బయలుదేరాయి. వాటర్ మెయినులు పగిలిపోయి మంటలు ఆర్పడానికి ఏ సౌకర్యం కలిపించలేదు. సుడిగాలులు బయలుదేరాయి; అందరి శరీరాలమీద నిప్పులు పడ్డాయి.

అప్పుడు ఈ మంటల వల్ల బయలుదేరిన వేడి అర్ధరాత్రికూడా 100°F కి పైబడి ఉంది. వేలమంది ప్రజలు మంటలలో కాలిపోయారు. వేలాది మంది మీద ఇళ్ళు కూలి చచ్చిపోయారు.

టోకియో భూకంపం ఫలితంగా 1 00,000 మంది మరణించారు. అరమిలియను ఇళ్ళు పూర్తిగా నాశనమై పోయాయి. వాటర్ మెయిన్‌లు, గాస్ పైపులు పగిలిపోయాయి. టెలిఫోను లైనులు, ఎలక్ట్రిక్ పవర్ కేబిల్స్ పడిపోయాయి. రోడ్లమీద పెద్దపెద్ద పగుళ్ళు ఏర్పడ్డాయి. నగరం సర్వనాశనం అయిపోయింది.

## వనితాలోకం



### కొబ్బరి నూనె షాంపూ

వేడినీళ్ళు కలిపేముందు సోపు బెల్లకి కొద్దిగా కొబ్బరినూనె కలపండి. జుట్టు శుభ్రం చేసుకున్న తరువాత పెద్ద చెంచాడు నిమ్మకాయ రసం కలిపిన వెచ్చని నీటిలో తల కడిగితే వెంట్రుకలు మృదువుగా ఉంటాయి. నల్లటి జుట్టుకి వినిగరు ఉపయోగిస్తే నల్లగా నిగనిగలాడుతూంటుంది.

### క్రొత్తకాడు మెత్తగా ఉండాలంటే

క్రొత్త కాడు మెత్తగా చెయ్యాలంటే కాడుని సబ్బునీళ్ళలో కొంతసేపు నానబెట్టి ఉంచితే, కాడు మెత్తపడిపోతుంది.

### ... పట్టకుండా ఉండాలంటే

పంచదార సీసాలో 4,5 లవంగాలు ఉంచితేసరి నల్లచీమలు చేరవు.

### నేలమీద ఒలికిన సిరా తుడవాలంటే

రెండు మూడు ఆముదం చుక్కలు వేసి తుడిస్తే సిరామరక పూర్తిగా పోతుంది.

'రాక్షసుడి! ఉన్నంత బలం ఉండటం గొప్పదన[illegible]
[illegible] రాక్షసంగా ఉపయోగించడం మూర్ఖత్వం

# భారతదేశంలో పోస్టల్ విధానం

వి.కె. బాలన్

భారత దేశంలో మొట్టమొదట గవర్న మెంటు కోసం ఈస్టు ఇండియా కంపెనీలో ఉన్న రాబర్ట్ క్లైవ్ పోస్టల్ విధానం 1766 లో ప్రారంభించాడు.

1837 లో ఈ పోస్టల్ విధాన సౌకర్యం ప్రజలకోసం ప్రారంభింపబడింది. మొట్ట మొదట తపాలాబిళ్ళ (పోస్టేజి స్టాంప్) 1852 లో కరాచీలో విడుదల చేయబడింది. ఆనాడు



ROBERT CLIVE

ఇది (ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉన్న) సింధ్‌లో మాత్రమే అనుమతింపబడేది.

ఇప్పుడు మనకు అమలులో ఉన్న పోస్టల్ విధానం అక్టోబర్ 1, 1854 న ప్రారంభమైంది. ఒకే సమానమైన పోస్టల్ ఖర్చుతో క్రమవిధానంలో పోస్టల్ సర్వీసును లార్డ్ డల్‌హౌసీ ప్రవేశపెట్టాడు. ఆ కాలంలో 24,500 మంది సిబ్బంది మొత్తం 700 పోస్టాఫీసులను నిర్వహిస్తూండేవారు. 33,000 మైళ్ళ దూరం రన్నర్స్ సౌకర్యం ఉండేది. ఈస్టు ఇండియాకంపెనీ పాలన వ్యాపించిన భారతదేశ మందంతటా ఈ పోస్టల్ సౌకర్యం ఏర్పడింది,

134 సంవత్సరాలలో దేశంతో పాటు పోస్టల్ విధానం కూడా అభివృద్ధి పొందింది. పోస్టల్ డిపార్ట్‌మెంట్ పోస్టుమాస్టర్ జనరల్ అధ్వర్యంలోకి వచ్చింది. శ్రీరాయ్ బహదూర్ షాలిగ్రాం మొట్టమొదటి భారతీయ పోస్టుమాస్టర్ జనరల్. పెద్ద, చిన్న పోస్టాఫీసులన్నీ దేశంలో పెద్దపెద్ద నగరాలలోను, పట్టణాలలోను నెలకొల్పబడ్డాయి. ఇవి సంవత్సరానికి సుమారు 12 మిలియన్ పోస్టల్ ఆర్టికల్స్‌ను నిర్వహించేవి

1854 లో ఏర్పడిన ఆధునిక పోస్టల్ విధానంతో అల్ ఇండియాకు చెందేటట్టుగా పోస్టల్ స్టాంపును విడుదల చేసారు. ఒక ప్రదేశాన్నుంచి మరో దూర ప్రదేశానికి వార్తలను అతి తక్కువ సమయంలో పంపడానికి డల్‌హౌసీ ఎలక్ట్రిక్ టెలిగ్రాఫ్ విధానం కూడాఏర్పరచాడు. కలకత్తా నుంచి డైమండ్ హార్బర్ వరకు ప్రభుత్వం వారి టెలిగ్రాఫ్ లైను సౌకర్యం ప్రయోగాత్మకంగా మొట్టమొదట డా. విలియం బి ఓ. షాంగ్‌నెస్సీ ఏర్పాటు చేసాడు. మొట్టమొదట పనిచేసే టెలిగ్రాఫ్ లైను 1853 లో ప్రారంభింపబడింది. కలకత్తా నుంచి ఆగ్రావరకు ఇది పొడిగింపబడింది. మొట్టమొదట టెలిగ్రాఫ్ మూలంగా మార్చి 24, 1854 న వార్త పంపబడింది.

1877 లో పోస్టల్ డిపార్టుమెంటు వారిచే

"నవ్వే మొహానికి అలంకరణ అనవసరం."

'వేల్యూ పేయబుల్ పోస్ట్" విధానం ప్రారంభింపబడింది. అదే సంవత్సరంలో విలువలో 50 శాతానికి పోస్టల్ పార్శిల్స్ ఇన్సూరెన్స్ ప్రవేశపెట్టబడింది. ఇన్‌లాండ్ మరియు ఫారిన్ పోస్టుకార్డులు 1879 లో ఇవ్వడం ప్రారంభించారు. మనియార్డరు విధానం 1880 లో ప్రవేశపెట్టబడింది. 1882 లో పోస్టాఫీసు సేవింగ్స్ బాంక్ సౌకర్యం ప్రారంభమైంది. ఈ నాడు ఈ సౌకర్యం దేశంలో 1,44,000 పోస్టాఫీసు


LORD DALHOUSIE

లలో ఉంది. మొత్తం రూ. 13,524 కోట్ల పెట్టుబడులతో దేశమంతటా సౌకర్యాలను కలిగిస్తున్న పెద్ద సేవింగ్స్ బాంక్ ఇది.

పోస్టల్ లైఫ్ ఇన్సూరెన్స్ విధానం 1884 లో ప్రారంభమైంది. ఇప్పుడు బాగా ప్రసిద్ధి పొందిన సర్టిఫికేట్ ఆఫ్ పోస్టింగ్ 1897-98 లో ప్రవేశపెట్టబడింది. ది రైల్వే మెయిల్ సర్వీసు 1907 లో, ఎయిర్ మెయిల్ సర్వీసు 1911లో ప్రారంభింపబడ్డాయి. ఏప్రిల్ 26 1929 న యునైటెడ్ కింగ్‌డమ్-ఇండియా ఎయిర్ మెయిల్ సర్వీసు ప్రారంభమైంది. ఆరునెలల తరువాత ఇండియన్ స్టేట్ ఎయిర్ మెయిల్ సర్వీసు ఢిల్లీ మరియు కరాచీల మధ్య ఏర్పాటు కాబడింది. చిన్న చిన్న మొత్తాలు పంపుకునే వారి సౌకర్యార్థం 1935 లో ఇండియన్ పోస్టల్ ఆర్డర్ ప్రారంభింపబడింది.




రెండవ మహాప్రపంచయుద్ధ సమయంలో పోస్టల్ డిపార్టుమెంట్ చే ఆర్మీ పోస్టల్ యూనిట్ల నిర్వహణకి తీవ్రమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పుడు 1941 లో ఆర్మీ హెడ్ క్వార్టర్స్‌లో క్వార్టర్ మాస్టర్ జనరల్స్ బ్రాంచిలో పోస్టల్ విభాగం సృష్టింపబడింది. ఒక సంవత్సరం అనంతరం ఈ విభాగం

విద్యార్థికి ఆ

విలువలను
...వంతో సౌందర్య
...కి, నియమంతో
...రి. కావిషో ప్రత్యేక
విద్యార్థి క్రమశిక్షణను
తక్కువ ఎంతమాత్రం తీసిపోదు.
—ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

...ఘంటువులోనే 'అసాధ్యము' అనే పదం ఉంటుంది.

డైరక్టరేట్‌గా విస్తరింపబడింది. లెఫ్టినెంట్ కల్నల్ జి.ఎన్. నాయుడు మొట్టమొదట డైరెక్టర్‌గా నియమింపబడ్డాడు.

పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్స్ డిపార్ట్‌మెంట్ చీలిపోవడంవల్ల పోస్టల్ మరియు టెలి కమ్యూనికేషనుల సర్వీసులకు ప్రత్యేకం విడివిడిగా 1985 జనవరి నుండి డిపార్ట్



RAI BAHADUR SHALIGRAM
THE FIRST INDIAN POST MASTER-GENERAL

మెంట్ ఆఫ్ పోస్ట్స్ మరియు డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికమ్యూనికేషన్స్ ఏర్పడ్డాయి.

ఆగస్టు 15, 1947 స్వాతంత్ర్యం నాటికి దేశంలో వివిధ పోస్టల్ కార్యకలాపాలను చేపట్టడానికి మొత్తం 22.116 పోస్టాఫీసులు ఉండేవి. ఇప్పుడు దేశంలో 1,44,000 కు పైబడి పోస్టు ఆఫీసులు ఉన్నాయి. వీటిలో సుమారు 6,00 000 ఉద్యోగస్థులున్నారు. సగటున ప్రతి పోస్టాఫీసు 21.86 చ కి.మీ.ల వైశాల్యంలో 4,736 వ్యక్తులకు సేవా సౌకర్యం కలిగిస్తుంది. ఇదే గాకుండా మొబయిల్ కౌంటర్ సర్వీస్ సౌకర్యాలతో 70,211 గ్రామాలకు సేవాసౌకర్యాలను కలిగిస్తున్నారు.

99 శాతానికి పైబడిన గ్రామాలలో మార్చి 31, 1984 నుండి దినసరి ఉత్తరాల బట్వాడా జరుగుతూంది. రైలు, విమానం, రోడ్డు మీదుగా రన్నర్లు, పడవలు, ఒంటెలు, గుర్రాలు సైకిళ్ళు సహాయంతో ఉత్తరాలు మోసుకుపోబడుతున్నాయి.

మొట్టమొదటి సైకిల్ పోస్టాఫీసు 1974 లో మహారాష్ట్రలో రత్నగిరి దగ్గర షిర్‌గోన్‌లో తెరవబడింది. ఇప్పుడు దేశంలో వివిధ ప్రదేశాలలో 500 సైకిల్ పోస్టాఫీసులు పనిచేస్తున్నాయి. మొట్టమొదట నీటిమీద తెప్ప (floating) పోస్టాఫీసు జూన్ 29 1976 న కేరళలోని కుట్టనాడులో ప్రవేశపెట్టబడింది.

134 సంవత్సరాల ముందు 28.000 ఉత్తరాలు, పార్శిళ్లు మొదలైన పోస్టల్ ఆర్టికల్స్ చేపట్టబడ్డాయి. ఇప్పుడు పోస్టల్ డిపార్టు మెంటు సంవత్సరానికి 2 కోట్ల ఉత్తరాలు, 4 లక్షల టెలిగ్రాములు, 2 లక్షల పార్శిళ్ళు చేపడుతున్నారు. ప్రతీ రోజు (సెలవు రోజు తప్ప) 4.03 కోట్ల మందికి ఉత్తరాలు బట్వాడా చేయబడుతున్నాయి. పోస్టాఫీసుల నుంచి, 5 లక్షల లెటర్ బాక్స్‌నుంచి పోస్టల్

**అన్ని దేశాల సంస్కారం నా ఇంట్లోకి నిరభ్యంతరంగా ప్రవేశించాలి**

నా ఇంటికి అడ్డుగోడలు కట్టుకుని కిటికీలు అలంకరించుకోడం కంటే అన్ని దేశాల సంస్కృతి నిరభ్యంతరంగా ప్రవేశించాలని కోరుకుంటా — మహాత్మాగాంధీ

''మధురమంటు ఇష్టమైతే వా కాదు, ఎవరికి ఏది మధురం.

ఆర్టికల్స్ సేకరిస్తారు. మొత్తం 3 లక్షల కిలో మీటర్ల ముఖ్యమార్గాల మీద ఇవి చేపట్ట బడతాయి.

పోస్టల్ ఇండెక్స్ నెంబరు (PIN) అనే న్యూమరికల్ పోస్టల్ ఎడ్రస్ కోడు పోస్టల్ డిపార్ట్‌మెంట్ వారు ఆగస్టు 15, 1972 న ప్రారంభించారు. ఈ ప్రణాళిక ప్రకారం ప్రజలకు ఎక్కువ సామర్థ్యవంతంగా పోస్టల్




సేవా సౌకర్యం కలిగించడానికి, ఉత్తరాలు మొదలైనవాటిని శీఘ్రంగా అందజేయడానికి వీలుగా పిన్‌కోడ్సు అనే జోన్ నంబరులు ఉపయోగింపబడుతున్నాయి.

క్విక్ మెయిల్‌సర్వీసు (QMS) విధానం 1975 లో ప్రారంభించారు. ఇది ముఖ్యంగా ఇప్పుడు రాష్ట్ర ముఖ్యపట్టణాలకు, వ్యాపార కేంద్రాలకు నియమితమై ఉంది. స్పీడ్‌పోస్ట్ సర్వీసు ఏప్రిల్ 1986 లో ప్రారంభించారు. దీనివల్ల ఉత్తరాలు అతిశీఘ్రంగా, భద్రంగా, నమ్మకంగా 24 గంటల లోపుగా చేరతాయి. భారతదేశానికి ప్రపంచంలో అన్ని దేశాలతో డైరెక్టుపోస్టల్ కమ్యూనికేషన్స్ సౌకర్యం ఉంది. భారతదేశం నుండి విదేశాలకు మెయిల్ విమానాలమీద, ఓడలమీద పంప బడుతుంది

## రాగ్యానికి కారణం మామిడిపండే

నందిపురాన్ని పాలించే చంద్రవర్ణుడికి నాల్గవ భార్య అలంకారవతి అనే శూద్రస్త్రీ వల్ల కలిగిన భర్తృహరి తండ్రి తరువాత సింహాసనం ఎక్కి కీర్తిప్రతిష్ఠలతో రాజ్యం పాలిస్తున్నాడు. ఒకరోజు ఒక యోగి ధర్మ పాలన చేస్తున్న భర్తృహరికి ఉపకారం చేయాలని ఒక మామిడిపండును ఇచ్చి ఇది దేవలోకంలో పండిన పండు, అపురూప మైనది. అందరికీ దుర్లభం. దీనిని తిన్న వారు నవయౌవ్వనంతో ఉంటారని. దీనిని అనుభవించడానికి అతడే తగినవాడని ఆశీర్వ దించి వెళ్ళిపోయాడు.

భర్తృహరి ఆ మామిడిపండును తన ప్రేయసికి ఇచ్చాడు. రాజు ఇచ్చిన ఆ పండును ఆమె తాను ఉంచుకున్న గుర్రపు వానికి ఇచ్చింది. ఆ గుర్రపువాడు తన ఉంపుడుగత్తె కాళికి ఇచ్చాడు. కాళి ఆ మామిడిపండుని నెత్తిమీద పేడతట్ట మీద పెట్టుకుని రాజవీధిగుండా వెళ

తవించింది. ఆ [illegible] ప్రేయసికి తానిచ్చినదని గ్రహించి దాన్ని పిలిచి అడిగాడు. గుర్రపువా డిచ్చినట్లు చెప్పింది. భర్తృహరి ప్రేయసిని విచారిం చాడు. కథ పూర్తిగా తెలిసింది. విరక్తి కలి గింది. "స్త్రీల కెంత సుఖమున్నా నీచగుణం పోదని" సంసారం మీద విరక్తి కలిగి రాజ్యం వదలి భర్తృహరి అడవులకు వెళ్ళి పోయాడు.

‘‘అబద్ధమాడితే క

ందుకే అసలు

నాకి నంద అబద్దాలాడాలి.

## బహుమతి పొందిన వ్యాసం

# గృహ సమస్య

వారణాశి పాపయ్యశాస్త్రి,
విజయనగరం.

గృహమంటే ఇల్లు. సమస్య అంటే పరిష్కరించవలసిన ప్రశ్న. గృహసమస్య అంటే నివసించడానికి ఇంటి సమస్య కానవ్వు. లేక కుటుంబ సభ్యులవల్ల యజమానికి కలిగే సమస్యలు కానవ్వు.

తిండి, బట్ట తరువాత ప్రతీ యజమాని ఎదుర్కోవలసింది గృహసమస్యే. తరువాతే కుటుంబీకుల సమస్య మానవులలో సంపన్నులూ, శ్రమజీవులూ అని రెండు వర్గాలు. సంపన్నులకు ఇళ్ళు ఉంటాయి. వారి పిల్లల సంసారాలకు ఇళ్ళు సమకూరుస్తారు. కాబట్టి ఇది వారికి సమస్యకాదు. అత్యధికులు శ్రమజీవులే. వారికి పెళ్ళవగానే ఇల్లు కట్టుకునే స్థోమత ఉండదు. ప్రభుత్వోద్యోగులైనా, కంపెనీ ఉద్యోగులైనా క్వార్టర్స్ ఉంటాయి. కాబట్టి వీరికి సమస్య తాత్కాలికంగా తీరుతుంది.

ఇక మిగిలినవారు అద్దె ఇళ్ళలో బ్రతకలేరు, స్వగృహం అమర్చుకోలేరు. అద్దె ఇళ్ళల్లో ఉంటూ ఉద్యోగంచేసి రిటైర్ అయే నైముకి ఇల్లు తలపెడతారు. తాహతుకి మించి అధికంగా సొమ్ము వెచ్చించి అప్పుచేసి కట్టిన ఇంట్లో అటువంటివారు ఎంత కాలం బ్రతకగలరు? క్రుంగి కృశించిపోయి దిగులుతో స్వంత ఇంట్లోనే మరణిస్తారు. ఇదే గృహసమస్య మరణాంతక ప్రభావం.

పైకప్పు నాలుగు గోడలతో ఇల్లు అయిపోతుంది. కానీ దానితో సరిపుచ్చుకోడానికి స్వగృహస్థుడు సిద్ధపడడు. గృహస్థుల దురాశ తనివి తీరనిది. సగం ఇల్లు అద్దెకు ఇవ్వడం, తదనుగుణంగా డ్రాయింగ్, బెడ్, లివింగ్, డైనింగ్, కిచెన్. స్టోర్ రూములు కావాలంటాడు.' శ్రీ శంకరాచార్యులవారు

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద నౌకా బలాలు



AIRCRAFT CARRIER

ఇప్పుడు ప్రపంచంలో యుఎస్ఎ మరియు సోవియట్ యూనియన్ మిక్కిలి పెద్ద నౌకా బలాలు. యుఎస్ నౌకలు అతి శీఘ్రంగా విమానాలను తీసుకుపోవడానికి సౌకర్యాలు కలిగి ప్రత్యేక గ్రౌండ్ పోర్షను ప్రపంచంలో ఎక్కడబడితే అక్కడ దింపడానికి వీలుగా ఉంటాయి. సోవియట్ నౌకలు హెలికాప్టర్లను తీసుకుపోవడానికి అనుకూలంగా ఉంటాయి.

'ఎంత అందంగా ఉన్నా ఒకే

శరీరమే గృహమన్నారు. వారికి గృహం తరుతలవాసమట. పొట్టకు కరతల భిక్ష చాలునట. గీతలో వ్యాసుడు భక్తుని లక్షణాలు చెబుతూ భక్తుడు నా ప్రియుడంటాడు. కావున నిజానికి ప్రతీ జీవుని స్వగృహం పరమాత్మే కావాలి. గృహం తగినదిగా ఉండాలి. విత్తంకొద్దీ వైభవం కనుక ఇల్లు ఆదాయాన్ని బట్టే ఉండాలి.

ఇల్లాలుంటే ఇల్లుండక తప్పదు. గృహముంటే గృహ సమస్యలు తప్పవు. గృహ సమస్యలనుండి పారిపోవడం అంటే సన్యాసులతో చేరటం వాటికి పరిష్కారమార్గం కాదు. తనకు చేతనైన రీతిలో గృహ సమస్యలను ఎదుర్కొంటూ ధర్మమార్గంలో పరిష్కరించుకోవడమే వ్యక్తి కర్తవ్యం.

* * *

సి. అపర్ణ, తెనాలి.

మనదేశంలో ప్రస్తుతం ఈ సమస్యను రెండు కోణాలలో పరిశీలించాలి. ఇంట్లో ప్రతిరోజూ ఉత్పన్నమయ్యే సమస్య. గృహముల వేటలో ఉత్పన్నమయ్యే సమస్య.

అన్ని ఆశ్రమ ధర్మాలు గృహస్థాశ్రమం పై ఆధారపడి ఉంటాయి. దినదిన ప్రవర్ధమానమవుతూన్న ద్రవ్యోల్బణంవల్ల ఎంతటి వారికైనా వారి వారి స్థోమతలకు అనుగుణంగా జీవించడం కష్టతరమవుతుంది. పూర్వం సమిష్టి కుటుంబాలు ఎక్కువగా ఉండటంవల్ల బాధ్యతలను ఎక్కువమంది పంచుకునే అవకాశం ఉండేది. నేడు ప్రతీ ఇంటా వేరుగా స్వతంత్రంగా ఉండడానికి ప్రయత్నించడంవల్ల ఎక్కువ సంఖ్యలో గృహాల అవసరం పెరగడమేగాక అనుభవజ్ఞుల, వృద్ధుల సహకార సహాయాదులు లోపిస్తున్నాయి.

జనాభా పెరుగుతూన్న కొద్దీ ముఖ్య అవసరాలైన తిండి, బట్ట, నీడలకు సహజంగా కొరత ఏర్పడుతూంది. దానికి తోడు ఉపాధి అవకాశాలు గ్రామాలలో తక్కువ అయిపోతూ నగరాలలో ఎక్కువ ఆశాజనకంగా ఉండటంవల్ల ప్రతివారు నగరాలకే వలవలు పోతున్నారు. అక్కడ ఇల్లుకట్టుకుందామన్నా స్థలాభావం వల్ల కుదరడం లేదు. నగర

## ఎక్కాలి దుర్గమమైన హిమవత్ శిఖరమార్గాలు



HIMALAYAS

మాజీ బ్రిటిష్ సైనికుడు హారీ టైలర్ మరియు న్యూజిలాండ్ వాసస్థుడైన రస్సెల్ బ్రైస్ హిమాలయ పర్వతశ్రేణిలో ఎవరెస్టు శిఖరాన్ని ఇంతవరకు ఎవరూ ఎక్కని ఈశాన్య దిక్కు మార్గంలో ఆగస్టు 6, 1988 న ఎక్కారు. వీరు పర్వత శిఖరానికి వెళ్ళడానికి ప్రయత్నించలేదు. హిమాలయ శిఖర మార్గాలో [illegible] చాలా దుర్గమమైనవి [illegible]

బుద్ధిమంతులనుంచి మూర్ఖులు నేర్చుకోగలిగిన దానికంటే,

వైశాల్యం పెరుగుతూండటం వల్ల నిత్యావసర వస్తువుల సరఫరాలో జాప్యం ఎక్కువ అవుతూంది. పట్టణాలలో అద్దెకు ఒక్క గది కూడా దొరకని పరిస్థితులలో పల్లెలలో ఇళ్ళు పాడుబడి పోతూన్నా ఆశ్చర్యపడిపోవలసిన పనిలేదు.

ఇళ్ళ కొరత పరిష్కరింప బడాలంటే మొదటగా పట్టణాలకు వలసపోవడం తగ్గాలి. జనాభా తగ్గుదలకు పాటుపడాలి. సహ కుటుంబ జీవన విధానాలను ప్రోత్సహించాలి. ఎప్పుడు ఒకే కుటుంబంలోని సభ్యులలో సామరస్యం నెలకొని ఉంటుందో సాంఘిక సుహృద్భావం కూడా పెంపొందింప బడుతుంది.

* * *

వి. జగదీశ్, వరంగల్.

గ్రాసం పరులదైనా వాసం తనదై ఉండాలన్నారు. ఎక్కడ ఏంతిన్నా విశ్రాంతికోసం ప్రతి జీవికి ఓగూడు అవసరం. కూడున్నా గూడు లేక అనేకమంది చెట్లక్రింద, బాటల ప్రక్క, పాడుబడ్డ దేవాలయాలలోను తల దాచుకుంటున్నారు. కొన్ని నగరాలలో అట్టి వారికి ప్రభుత్వం సదుపాయాలు కలిగిస్తూన్నా ఇంకా పల్లెలలో, ఇతర పట్టణాలలో అవస్థలు పడుతూనే ఉన్నారు.

మధ్య తరగతి కుటుంబాల వారికి కూడా గృహసమస్య తప్పలేదు. అందరికీ స్వంత ఇళ్ళు ఉండవు. కొందరు అద్దె ఇళ్ళలో ఉంటారు. యజమానులు తరచు అద్దెలు పెంచుతూంటారు. సౌకర్యాలు చూపక అనేక ఆంక్షలు పెడతారు. ఈ బాధలకు తట్టుకోలేక ఇళ్ళు మారుతూంటారు. అక్కడా తప్పవు ఈ సమస్యలు.

గృహ సమస్య తీర్చడానికి ప్రభుత్వం వారు అనేక పథకాలు అమలుచేస్తున్నారు. అవక తవకలు లేకుండా ఆ పథకాలు రూపు దిద్దుకుంటేనే తప్ప గృహసమస్యలు తీరవు.

## మోదుగా ఎగిరిన మిక్కిలి చిన్న పైలట్



CHRISTOPHER LEE MARSHALL

# పక్షులకు దారి ఎలా తెలుస్తుంది?

సి.పి. జయలక్ష్మి

అనేక జాతుల పక్షులు శీతాకాలంలో చలికి తట్టుకోలేక ఉత్తర ధృవప్రాంతాలనుంచి ఉష్ణప్రదేశాలకు వలసలు పోతూండడం అందరికీ తెలిసిన విషయమైనా అంత ఖచ్చితంగా అవి ఎలా వెళ్ళగలుగుతున్నాయి అనేది అందరినీ మభ్యపెడుతూనే ఉంది.



BIRD MIGRATION

ఆర్కిటిక్ టెర్న్ అనే పక్షి ప్రతీ సంవత్సరం కొన్నివేల కిలోమీటర్ల రికార్డు దూరం ప్రయాణం చేస్తుంది. ఇది ఆర్కిటిక్ వలయం (లాటిట్యూడ్స్) దగ్గర వేసవి కాలంలో జతకూడే ఉష్ణప్రదేశం నుంచి అంటార్కిటిక్ తీరపు శీతల ప్రదేశాలకు వలసలు పోతాయి.

షీర్‌వాటర్ అనే పక్షి సూదిమొన ఖచ్చితంగా దారి తెలుసుకుని ఎగురుతూ ఉంటుంది. ఇది శీతాకాలంలో ఉత్తర అట్లాంటిక్ తీర ప్రదేశాలలో శీతాకాలం గడిపి దక్షిణ అట్లాంటిక్ ప్రదేశాలలో అగ్నిపర్వతం ఉన్న దీవిలో జతకట్టడానికి పోతాయి. ముఖ్యంగా ఈ పక్షుల కాలనీలు ఏర్పరచుకోడానికి ఈ ప్రదేశమే వీటికి ముఖ్యం.

బ్రాంజ్ కుక్కూ న్యూజిలాండ్‌లో వలసలు పోని ఒక జాతి పక్షి గూటిలో గ్రుడ్లు పెట్టి పొదుగుతాయి. ఇవి తరువాత 3.000 కి మీ. ఈశాన్య (నార్త్ వెస్ట్) దిక్కుగా ఎగిరి పసిఫిక్ మహాసముద్రంలో మెలనేసియన్ అర్చిపెలాగో శీతలవాస ప్రదేశాలకు చేరతాయి.

చాలా పక్షులు రాత్రిపూటే వలసలు బయలు దేరతాయి. వీటికి ఇది ఎలా సాధ్యమవుతుంది? యుఎస్ కార్నెల్ యూనివర్శిటీకి చెందిన స్టీవెన్ ఎమ్లీన్ ప్రకారం పక్షుల ఈ

## మీకు తెలుసా?

వంటింట్లో తగిలె చిన్న చిన్న గాయాల మీద నగం కోసిన వల్లిట బంగాళా

[illegible] మొదలై

... కొద్దిసేపటికి రంగు మారిపోవడం మీరు గమనించే ఉంటారు. అలా కాకుండా ఉండేందుకు ముక్కల పై [illegible]

నిమ్మకాయను వేడినీటిలో పది హేను నిమిషాలపాటు ఉంచితే దాని నుంచి మామూలు కన్నా ఎక్కువ రసం

“పరిపక్వమైన ఫలమునందు పచ్చివాసన

నైపుణ్యాన్ని అభ్యాసం చేసుకుంటాయి. ఇది వాటి సహజ లక్షణం కాదు అని తేల్చారు. సుమారు ఒక శతాబ్దం క్రితం భూమియొక్క అయస్కాంత క్షేత్రమును అనుసరించి ఈ పక్షులు ఎగురుతున్నాయనే సిద్ధాంతం ప్రతిపాదింపబడింది.



పై పక్షులు మరియు మరికొన్ని ఇతర పక్షులు, సైబీరియా కొంగలు ప్రదర్శించే ఈ అపూర్వ శక్తి పక్షులను గురించి పరిశోధించే ఓర్నిథాలజిస్టుని మోహపెట్టేసింది. రాత్రి కంటే పగలు దీర్ఘంగా ఉండటం, ఉష్ణోగ్రత మార్పులు వంటి కొన్ని జీవావరణ సంబంధమైన కారణాలను బట్టి వలసల కాలాలు ఏర్పడుతున్నాయి.

ఏది ఏమైనా ఈ వలస పక్షులకు దారి ఎలా తెలుస్తుంది అన్న విషయం అందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది. సాటిలైట్, కంపాస్, సెక్స్టాంట్ వంటి ఆధునిక పరికరాల సహాయం లేకుండా వివరాలు తెలియని విశాలమైన పెద్ద పెద్ద సముద్రాల మీదుగా ఎగిరి వలసలు పోతున్నాయి. ఇదంతా ఒక అద్భుతమైన మాయాజాలంగా కనిపిస్తుంది.

పావురాలు ఎగిరే విధానాన్ని పైలటింగ్ అని చెప్పవచ్చు. ఒక పొలిమేర నుంచి మరో ప్రదేశానికి వెళ్ళడానికి ప్రత్యేకమైన నైపుణ్యం అవసరం లేదు. కానీ మొట్టమొదట కొంత శిక్షణను ఇచ్చినా వీటి నైపుణ్యం అనేక కారణాలనుబట్టి ఏర్పడుతుంది. మొట్టమొదట 1950 లో క్రామర్ మరియు నోబెల్ లారేట్ అయిన ప్రొ. కె. వి. ఫ్రిస్క్ ఇద్దరూ సూర్యుడే దిక్సూచిగా వినియోగింపబడుతూందని విడివిడిగా చెప్పారు.

మబ్బు పట్టినప్పుడు ఇది ఎలా సాధ్యం మబ్బులు పట్టినా పక్షులు వాటి వలస మార్గం తెలుసుకోగలుగుతున్నాయి అంటే, కాంతి పోలరైజేషన్ వల్ల అవి సూర్యుడు ఉండే స్థానాన్ని తెలుసుకోగలుగుతున్నాయి అన్నారు.

వలసలు పోయే పక్షులకు వాసన, శబ్దం కూడా సహకరిస్తున్నాయని అంటున్నారు. వీటికి అనేక సూచనల సహాయం ఉంటుంది. అనువైన సూచనలను అవి అనుసరిస్తాయి.

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## జర్మను దేశస్థులు విదేశీ యాత్రలమీద 48 బిలియను మార్కులు వెచ్చించారు

విదేశీ యాత్రల మీద జర్మనీ వెచ్చించినంత మరే దేశం వెచ్చించదు. 1987 లో జర్మనులు (ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ) విదేశీ యాత్రలకు రికార్డు స్థాయిలో 48 బిలియను మార్కులు ఖర్చు చేశారు. జర్మనీకి టూరిజంవల్ల వచ్చిన ఆదాయం 18 బిలియను మార్కులు.

లవాలు అందరికీ లభిస్తాయి. కానీ వాటివల

# సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## డా. హోమి జహంగీర్ బాబా

క్రోటికి ఒకరు డా. హోమి జహంగీర్ బాబా వంటి వ్యక్తులు ఉంటారు. ఇతడు అద్భుతమైన వ్యక్తి. అక్టోబరు 30, 1909 లో జన్మించిన డా. బాబా మంచి విద్యావంతుడు, గొప్ప మేధావి. ఇతడు 1930 లో ఇంగ్లండు కేంబ్రిడ్జి యూనివర్శిటీలో గ్రాడ్యుయేటు పరీ




క్షలో ఉత్తీర్ణుడై అదే యూనివర్శిటీ నుంచి 1934 లో పి.హెచ్.డి పట్టాను పుచ్చుకున్నాడు.

బెంగుళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో థియరిటికల్ ఫిజిక్స్‌కి రీడరుగాను, బొంబాయి టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చిలో కాస్మిక్ రే పరిశోధనా విభాగానికి ప్రొఫెసర్‌గా కూడా పని చేసాడు. 1947 లో ఇతడు భారతదేశపు ఎటామిక్ ఎనర్జీ కమిషన్ చైయిర్మన్‌గా నియమింపబడ్డాడు. 1966 లో మరణించే వరకూ అదే పదవిలో ఉన్నాడు. 1954 నుండి 1966 వరకు భారతీయ ప్రభుత్వము వారి ఎటామిక్ ఎనర్జీ డిపార్ట్‌మెంట్ సెక్రటరీగా కూడా ఉన్నాడు.

ఇండియన్ సైన్స్ కాంగ్రెస్‌కి అధ్యక్ష పదవిని పొందాడు. అణుశక్తి శాంతి ఉపయోగాల కోసం ఏర్పాటైన సమావేశానికి అధ్యక్షుడుగా ఉన్నాడు. ఇంటర్నేషనల్ ఎటామిక్ ఎనర్జీ ఏజెన్సీ సైంటిఫిక్ ఎడ్వైజరీ కమిటీ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. ఇంగ్లండ్ రాయల్ సొసైటీ ఫెలోగా నియమింపబడ్డాడు. 1954 లో భారతీయ ప్రభుత్వమువారు పద్మభూషణ్ బిరుదును ఇచ్చి గౌరవించారు

అనేక పరిశోధనా పత్రాలను ప్రచురించాడు. ‘క్వాంటం థియరీ’, ‘ఎలిమెంటరీ ఫిజికల్ పార్టికల్స్’, ‘కాస్మిక్ రేడియేషన్’ మొదలైనవి ఇతడి కొన్ని ప్రచురణలు.

### అంతా రాతిమయం

యూఎస్ఏలోని మిస్సోరీలో సెంట్ లూయిస్‌కు చెందిన వాషింగ్టన్ యూనివర్సిటీలో మాక్ డొన్నెల్ (Mcdonnell) కేంద్రంలో అంతరిక్ష శాస్త్రజ్ఞుల పరిశీలన ప్రకారం ప్లూటో ఉపగ్రహం కాదు. పొరుగున ఉన్న నెప్ట్యూన్ గ్రహం నుంచి ఏర్పడిన చంద్రుడు కాదు. ప్లూటో ఇతర గ్రహాలలాగ ఒక అగోళరాశి అని వీరి నమ్మకం. ఇతర వాటికంటే ప్లూటో అంతా రాతిమయంగా ఉందని వీరు నిర్ణయించారు.

— బ్రిటిష్ సైన్స్ మాగజైన్ సౌ

‘నీ మనస్సును నీవు శాసించగలిగిననాడు

బ్రహ్మాండమైన ప్రజ్ఞావంతుడు, అపారమైన బుద్ధి కుశలత గలవాడు. ఇతడు ఇంజనీరింగ్ మరియు టెక్నాలజీ అధ్యయనం చేస్తూ తరువాత ఎటామిక్ ఫిజిక్స్ చదివాడు. తన ప్రతిభా సామర్థ్యాలను ఎటామిక్ ఫిజిక్స్‌లో ఉపయోగించి అనేక సంవత్సరాల పాటు కృషిచేసి కాస్మిక్ రే షవరుల 'కాస్కేడ్' సిద్ధాంతాన్ని ప్రతిపాదించి కీర్తి పొందాడు. ఈ సిద్ధాంతాన్ని ఉపయోగించి కాస్మిక్‌రే షవర్లలో కనబడే కొన్ని కణాలు న్యూక్లియర్ కణాలని ఇవి ప్రోటానులలాగ, ఎలక్ట్రానులు లాగ ప్రవర్తించవని రుజువు చేసాడు. ఈ కణాలు సాపేక్ష సిద్ధాంతమును అనుసరించి వాటి అపూర్వ వేగావేశము వలన చాలాకాలం జీవిస్తాయని నిరూపించి తిరుగుతూన్న గడియారాలు స్లో అవుతాయనే ఐన్‌స్టైన్ చెప్పిన దానిని రుజువు చేసాడు. కాస్మిక్‌రే ఫిజిక్స్‌లో కాస్కేడ్ సిద్ధాంతానికి ప్రాతిపదికమైన ప్రాముఖ్యత ఉంది.

స్వాతంత్ర్యం తరువాత వెంటనే ఏర్పాటు కావింపబడిన ఎటామిక్ ఎనర్జీ కమిషన్‌కి ముఖ్యాధికారిగా నియమింపబడ్డాడు. అణువులో నిబిడమైన బ్రహ్మాండమైన శక్తిని వినియోగించడానికి దేశానికి ప్రబోధం కలిగించాడు. దేశంలో తక్కువగా అభివృద్ధి పొందిన ప్రదేశాలను పూర్తి పారిశ్రామికం చేయడానికి అణుశక్తి ముఖ్యమని విశ్వసించాడు.

బొంబాయిలో తారాపూర్ వద్ద మొట్టమొదట అణుశక్తి కేంద్రస్థాపనకు తన శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించాడు. మొట్టమొదట అణుకేంద్రం పని ప్రారంభించడం చూడడానికి ఇతడు నోచుకోలేదు మధ్యయూరప్‌లో మౌంట్ బ్లాంక్ వద్ద విమానం కూలిపోయి జనవరి 24, 1966న మరణించాడు. డా. బాబా తన అమూల్యమైన కాలాన్ని, శక్తిని, బుద్ధిని విజ్ఞానాభివృద్ధికి ధారపోసాడు.

## ప్రపంచంలో బ్రహ్మాండంగా నాటకము




ప్రపంచంలో ఏళ్ళతరబడి బ్రహ్మాండంగా ప్రదర్శింపబడుతూన్న నాటకం మౌస్‌ట్రాప్. 1952 లో ప్రారంభమైన ఈ నాటకం 15,000వ ప్రదర్శన ఇటీవల లండన్‌లో ఏర్పాటైంది. అగాథాక్రిస్టీ రచించిన ఈ క్రైమ్ థ్రిల్లర్‌లో అక్టర్‌గా ఉంటూ ప్రసిద్ధ డైరెక్టర్‌గా మారిన సర్ రిచర్డ్ ఎటెన్‌బరో మొట్టమొదట డిటెక్టివ్ సార్జెంట్ ట్రాటర్.

"మానవుడు ఏమతంలో చేరినా సత్యం, ధర్మం న్యాయాధిగుణములనే ప్రబోధం చేసాయి."

# బీట్‌రూట్ కథ

రాఘవేంద్రరావు

'బీటా వల్గారిస్' లేక బీట్‌రూట్ (దుంప) అనేది ముఖ్యంగా మధ్యధరా ప్రాంతం, ఆసియా మైనర్, కాకసస్ మరియు నియర్ ఈస్ట్ ప్రదేశాలలో దానంతటదే కృషి చేయకుండా విస్తారంగా పెరుగుతూండేది. ఆహార పదార్థంగా ప్రాచీన గ్రీకులు దీని ఉపయోగం




తెలుసుకున్నారు. బి.సి. 4 వ శతాబ్దంలో అరిస్టాటిల్ దీనిని గురించి వ్రాసాడు.

రోమనులకు, గ్రీకులకు కూడా బీట్ దుంపను గురించి తెలిసినా దూరప్రాచ్య ప్రదేశాలలో దీనిని గురించి తెలియదు. ఎ.డి. 7 వ శతాబ్దానికి ముందు చైనీస్ గ్రాంథికల్పలో దీని ప్రస్తావన లేదు.

ప్రాచీన కాలంలో బీట్ దుంపకి అనేక పేర్లుండేవి. రోమనులు బేటా (beta), అరబ్బులు సెల్గ్ (selg), పోర్చుగీసులు 'సెల్గా' (selga), జర్మనులు 'ఎసెల్గా' (acelga) అని పిలిచేవారు. ప్రాచీనకాలంలో బీట్ దుంపను ఔషధాలలో ఉపయోగించేవారు.

స్పెయిన్ దేశపు యాత్రికులు వ్రాసిన ప్రాచీన శాసన పరిశోధనలవల్ల తెలిసిన సారాంశం: యుఎస్ఎ కాలిఫోర్నియా శాంతా క్లారా వాలీలో నివసించే రెడ్ ఇండియనులు అడవిరకపు బీట్‌దుంప రసం నుంచి ఒక రకం కాండీని తయారు చేసేవారు.

బీట్‌దుంప సాధారణంగా నాలుగురకాలుగా పండుతూందంటే ఆశ్చర్యపడక మానరు. సాధారణ బీటు దుంప, పంచదార దుంప, మాంగెల్-వర్జెల్ (mangel-wurzel) ఛార్డ్ (chard) అనేవి సాధారణ రకాలు. అన్నిటిని మించినది, వ్యాపారరీత్యా మిక్కిలి ముఖ్యమైనది పంచదారదుంప.

బీట్‌రూట్‌లో పంచదార మొట్టమొదట 16 వ శతాబ్దంలో కనుగొనబడింది. కానీ 1747 లోనే జర్మన్ శాస్త్రజ్ఞుడు ఆండ్రూస్ మార్గ్‌గ్రాఫ్ ప్రత్యక్షంగా బీట్ రసం నుంచి సుక్రోజు స్ఫటికీకరణం చేయవచ్చుని ప్రదర్శించాడు. 1799 నాటికి బీటుదుంప నుండి వచ్చే పంచదార వ్యాపారరీత్యా మంచి

(మిగతా 63 వ పేజీలో)

## బ్రహ్మాండమైన టివి స్క్రీన్

జపాన్‌లో సోనీ కార్పొరేషన్ ప్రపంచంలో మిక్కిలి పెద్ద టెలివిజన్ స్క్రీన్ అమ్మకం ప్రారంభించింది. ఇది 1.5 మీటర్ల పరిమాణంతో డిజిటల్ ఫ్రేమ్ మెమరీ అమర్చబడి ఉంటుంది.

"చిన్న విషయాలలో శ్రద్ధకలవాడు

# ఉప్పు తక్కువగా వాడండి

ఉప్పు తక్కువ తింటే ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. కాని గత కొన్నివేల సంవత్సరాలుగా లోకంలో అందరికీ ఆహారంలో ఉప్పు ఒక అభిలషణీయమైన పదార్థం అయింది. ఉప్పులేందే ముద్ద దిగదు.

"ఉప్పులేని కూర ఒప్పదు రుచులకు
పప్పులేని తిండి ఫలములేదు"

అని అనారు వేమన చెప్పాడు.

ఉప్పు ఎక్కువగా అవసరమని చాలా మంది అనుకుంటారు. తల్లులు తమబిడ్డలకు ఆహారంలో ఉప్పు ఎక్కువగా చేరుస్తారు. ఒక్కొక్కప్పుడు పైవికులకు ఉప్పు మాత్రలు ఇస్తారు. చాలామంది ఆటగాళ్ళు చెమట రూపంలో నష్టమైపోతున్న ఉప్పుని శరీరంలో భర్తీ చేసుకోడానికి ఎలక్ట్రోలైట్ డ్రింకులు త్రాగుతారు.

నిజమే మనకి ఉప్పు (Sodium Chloride) అవసరమే. శరీరంలో కొన్ని ముఖ్య ధర్మాలు నెరవేరడానికి సోడియం అయానులు, క్లోరైడ్ అయానులు చాలా అవసరం. రక్తంలోను మరియు ఇతర శారీరక ద్రవాలలోను లభించే రసాయనిక పదార్థాలు విద్యుదావేశ కణాలు లేక అయానులు (Ions). అయినప్పటికీ మనకు అవసరమైన ఉప్పు చాలా తక్కువ. ఇది అదనంగా ఉపయోగించకుండానే మనం తినే ఆహారపదార్థాలలో మనకు అవసరమైనంత లభిస్తుంది.

జంతువులపై జరిపిన ప్రయోగ ఫలితాలు మరియు మానవులపై నలిపిన పరిశోధనల ఫలితంగా 'సోడియం హైపర్ టెన్షన్' (హై బ్లడ్ ప్రెషర్) సిద్ధాంతం ఏర్పడింది. దీని ప్రకారం ఎక్కువగా ఉప్పు తినడంవల్ల హైపర్ టెన్షన్ ఏర్పడుతుంది వ్యావహారికంగా అధిక 'సోడియం ఆహారం' అంటే ఎక్కువ ఉప్పుతో కూడిన ఆహారం అని అర్థం.

అధికంగా ఉప్పుచేర్చిన ఆహారంవల్ల మానవులు హైబ్లడ్ ప్రెషర్‌కి గురికావచ్చునని పరిశోధనలవల్ల తేలింది. మొత్తం జనాభాలో 10 శాతం, వంశ పారంపర్యంగా హై బ్లడ్ ప్రెషర్‌తో బాధ పడవచ్చని ఇప్పుడు

## భారతదేశంలో 80,000 జంతు జాతులు



ఇప్పుడు భారతదేశంలో 80,000 వివిధ జంతుజాతులు ఉన్నాయి. వీటిలో 67,000 రకాల కీటకాలు, 1,000 రకాల నత్తలు, 6,500 రకాల వెన్నెముకలేని జంతువులు, 1,400 [illegible] 140 రకాల [illegible] చరాలు, 420 రకాల సరీసృపాలు, 1,20 రకాల పక్షులు, 340 రకాల క్షీరదా ఉన్నాయి. 20,000 [illegible]

'ఎవరి ధర్మాన్ని వారు పాటించినప్పుడు

విశ్వసిస్తున్నారు. అంటే ఈ రోగానికి గురి అయ్యేవారు ఎక్కువ ఉప్పుచేర్చిన ఆహారం తింటే సులభంగా బ్లడ్ ప్రెషర్ తెచ్చిపెట్టు కుంటారు. ఈ రోగానికి సులభంగా గురి అయ్యేవారిని గుర్తుపెట్టి తెలుసుకోడానికి వివిధ పరీక్షలు జరుగుతున్నాయి. రక్త సంబంధమైన వారిలో ఎవరికైనా బ్లడ్ ప్రెషర్ ఉంటే మీకూ సులభంగా రావడానికి అవ కాశం ఉంది.

బ్లడ్ ప్రెషర్ తక్కువగా ఉన్నప్పుడు మోతాదుగా ఉప్పు తినడం నియమంలో పెట్టుకోగలిగితే ఇతర ఔషధాల సహాయం లేకుండా బ్లడ్ ప్రెషర్‌ని నివారించుకోవచ్చు. బ్లడ్ ప్రెషర్ తగ్గడానికి చాలామంది వైద్యులు ఉప్పు ఉపయోగం తగ్గించ మంటారు.

సాధారణంగా మనకు అవసరమైన దాని కంటే 10 మొదలు 20 రెట్లు అధికంగా ఉప్పును మనం తింటున్నాము. మంచి ఆరోగ్యవంతులైనవారికి ఉప్పు వారు తినే ఆహారంలోనే లభిస్తుంది. పాలు, గ్రుడ్లు, మాంసము మొదలైనవాటిలో తగినంత ఉప్పు ఉంటుంది. కాయగూరలలో ఉప్పు వివిధ పరిమాణాలలో ఉంటుంది. పప్పు ధాన్యాలు, బాదంపప్పు మొదలైనవాటిలో చాలా తక్కువగా లభిస్తుంది.

పెద్దవారి ఆరోగ్య విధానంలో 'హైపర్ టెన్షన్' ఒక తీవ్రమైన సమస్యగా పరిణ మించింది. దీనివల్ల పక్షవాతము, గుండె జబ్బులు, కిడ్నీజబ్బులు మొదలైనవి అధికం కావడానికి అవకాశాలు చాలా ఉన్నాయి. 'హైపర్‌టెన్షన్' నిరోధకానికి నివారణకి కూడా అధిక వ్యయం లేకుండా సులభంగా అమోఘంగా పనిచేయడానికి ఆహారంలో ఉప్పు ఉపయోగం బాగా తగ్గించడంకన్నా వేరే ఔషధంలేదు.

## 3000 బి. సి. లోనే ప్రత్తిని గురించి భారతదేశానికి తెలుసు




భారతదేశంలో 3000 బి. సి. నుంచి ప్రత్తిని గురించి తెలుసు. నూలుబట్ట అవ శేషాలు పెరు (దక్షిణ అమెరికా) అరిజోనా (యుఎస్ఏ) శిథిలాలలో కనుగొనబడ్డాయి. ప్రత్తినుండి బట్టనేసుకోటానికి నూలును తీస్తారు. పశువులు ఆహారానికి, వంటనూనెకు కూడా ఉపయోగపడుతుంది.

ప్రత్తికాయల గింజలచుట్టూ ఉండే ప్రత్తి నుండి నూలు వడుకుతారు. ప్రత్తికాయ పండి పగిలినప్పుడు ప్రత్తి కోయడానికి సిద్ధంగా ఉంటుంది.

ప్రపంచంలో యునైటెడ్‌స్టేట్స్, సోవి యెట్ యూనియన్, చైనా, ఇండియా ప్రత్తిని [illegible]

'అనుభవమను పాఠశాలలో పొందిన అభ్యాసము పుస్తక

ఉప్పుతింటే శరీరంలో రోగాలు జీర్ణించుకుపోయి దీర్ఘ రోగాలుగా పరిణమిస్తాయని, పుష్టికరమైన పప్పుతింటే రోగాలు పోతాయని అనుభవజ్ఞులైన వైద్యులు ఈ ఉప్పిడి పథ్యాన్ని ఏనాడో బాలభాషలో 'ఉప్పు తింటే ఊరిపో, పప్పుతింటే పారిపో' అని ప్రచారం చేసారు.

ఉప్పుతినడం తగ్గించుకోవాలంటే:

1. మొట్టమొదట పసిపిల్లలకు ఉప్పు రుచిని అభివృద్ధి చేయవద్దు.
2. అన్నం తినేటప్పుడు ఉప్పు ఉపయోగించడం, ఊరగాయలు వచ్చళ్ళుతగ్గించాలి.
3. ఉప్పువేసిన బంగాళాదుంప చిప్పులు, అరటికాయ చిప్పులు, ఉప్పువేసిన వేరు శనగపప్పు మొదలైనవాటి వాడకం తగ్గించాలి.
4. క్రమక్రమంగా వంటకాలలో ఉప్పు వాడడం తగ్గించాలి. ఎప్పుడూ సోడా (సోడా బైకార్బొనేటు) పొడి వాడవద్దు.
5. వెల్లుల్లి, నిమ్మరసం, ఏలక్కాయలు, దాల్చిన చెక్క (లవంగపట్ట), జీలకర్ర జాజిపువ్వు, జాజికాయ మొదలైన సుగంధ ద్రవ్యాలు కొద్ది కొద్దిగా వాడి ఆహారానికి రుచి కలిగించుకోవాలి.
6. ఉప్పుచేరని మార్గరిన్ లేక ఉప్పు చేర్చని వెన్నతో రొట్టె కాల్చుకోడం మంచిది.
7. ఉప్పుగాని, సోడియం కాంపౌండులు గానీ చేర్చని సువాసన ద్రవ్యాలను మాత్రమే వాడండి.

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

# నిజమైన స్నేహితుడు



పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉన్నప్పుడు
సకాలంలో ఆదుకుంటాడు
ఆశయాలు ఫలించనప్పుడు సహాయ
పడతాడు
నీ తప్పుకోసం ప్రాథేయపడడు
సక్రమమైన మార్గాన్ని చూపిస్తాడేగాని
నీకు ఆటంకం కలిగించడు
నీకు ప్రాముఖ్యత కలిగించడమే
అతని ముఖ్య ఆశయం
దిక్కు తోచనప్పుడు దిక్కు చూపిస్తాడు
నిరాశ్రయుడవు అయినప్పుడు ఆశ్రయం
ఇస్తాడు
నీకింత సహాయం చేసినందుకు అతడు
కోరేది నీ అభినందన మాత్రమే
నీ విమర్శకులను అధిక్షేపించి నీకు
పరవశం కలిగిస్తాడు
నీ సద్విమర్శలను హర్షిస్తాడు
అమూల్యమైన స్నేహాన్ని

'లోకుల మాటలు కాకుల కూతలు.'

# 75 ఏళ్ళ భారతీయ సినిమా

డా. ఇంటూరి వేంకటేశ్వరరావు

1913 లో పాల్కే నిర్మించిన రాజా హరిశ్చంద్ర తీసినప్పటినుంచి ఇప్పటికి భారతీయ సినిమా పరిశ్రమకు 75 ఏళ్ళు నిండాయి. 'భక్త పుండరీక' అనే సుప్రసిద్ధ రంగస్థల నాటకాన్ని అనుసరించి అదే పేరుతో 1912లో దాదా జీ టోర్నె సినిమా తీసినట్టు చరిత్ర



చాటుతూంది అయినా నటీనటుల, కెమెరా కదలికలు లేకుండా ఒక రంగస్థల నాటకం ఫిల్ము తీయబడింది. కాబట్టి అది ఒక ఫీచర్ ఫిల్ము అనిపించుకోదు. అంతేగాకుండా అది భారతీయుడు తీసిందికాదు. జాన్సన్ అనే విదేశీయుడు తీసింది. కాబట్టి మొట్టమొదటి దేశవాళీ బాణీలో పూర్తి ఫీచర్‌ఫిల్ము తీసిన ఘనత పాల్కేకే దక్కుతుంది. అంతకు ముందే దక్షిణ భారతదేశంలోను, మహారాష్ట్రలోను కూడా ఫిల్ములను తీయడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి.

ముష్టియుద్ధం (Wrestling Bouts) సర్కసు కోతుల శిక్షణ (Training of Circus Monkeys), విక్టోరియా టెర్మినల్ దగ్గరకు రైళ్ళు చేరుట (Arrival of Trains at Victoria Terminus) వంటి షార్టులను భట్వాదేకర్ అనే సవేదాదా తీసాడు.

1909 లో మద్రాసులో నివసిస్తూన్న రఘుపతి వెంకయ్య దిగుమతి చేయబడిన సాధనం 'క్రోనో మెగాఫోన్' సహాయంతో ప్రదర్శనలు ప్రారంభించి తరువాత హాలీవుడ్‌లో శిక్షణను పొందిన ఆయన కుమారుడు ఆర్. ఎస్. ప్రకాష్ సహాయంతో 'స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిల్మ్స్' అనే పేరుతో చిన్న చిన్న చిత్రాలు తీసారు. మద్రాసుకు చెందిన నటరాజ మొదలియార్ 1911 లో 'లార్డ్ కర్జన్స్ ఢిల్లీ దర్బారు'ను తీశాడు తరువాత 1917 లో అతడు 'కీచక వధ' అనే మూకీ (silent) చిత్రాన్ని నిర్మించాడు. 1900లో కలకత్తాలో హీరాలాల్ సేన్ స్వంతంగా ఒక కెమేరాను నిర్మించి దాని సహాయంతో సుప్రసిద్ధ బెంగాలీ బాలెట్ 'ఆలీబాబా'లో కొన్ని సన్నివేశాలను సినిమా తీశాడు.

ప్రపంచంలో అందరూ

తనకు అండగా భగవంతుడున్నట్లు భావించు

ఫాల్కే ఫీచర్ ఫిల్ము హరిశ్చంద్ర విజయంతో భారతదేశంలో సినీమా తీయడం ఒక గౌరవప్రదమైన వృత్తిగా పరిణమించింది. అందుకే దాదాఫాల్కేని ఫాదర్ అఫ్ ది ఇండియన్ సినీమా అని గౌరవిస్తారు.

1931లో అర్దేషిర్ ఎమ్ ఇరాని ఉత్సాహంతో ముందుకు బయలుదేరి మొట్టమొదట భారతీయటాకీ 'ఆలమ్ ఆరా' తీసి భారతీయ సినీమాకి రూపురేఖలు దిద్దాడు. చరిత్రాత్మకమైన ఈ ఘనకార్యాన్ని పూర్తి చేయడానికి ఇతడు ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది.

గత 75 సంవత్సరాలనుంచీ ఎన్నో ప్రతిబంధకాలు, అడ్డంకులు, ఆటంకాలు ఎదురవుతున్నా భారతీయ సినీమా ఉరుకులు, పరుగులతో ప్రగతి పూర్వకంగా ప్రవృద్ధిపొందింది. సౌండ్, కలర్, సినీమా స్కోపు వగైరాల వంటి నవ్యకల్పనలను చేపట్టింది. సాంకేతికంగా, కళాత్మకంగా భారతీయ సినీమాలు ఉత్తమమైనవి. ప్రపంచం అంతటా ప్రశంసించబడ్డాయి.

భారతీయ సినీరంగంలో నేడు 2000 కోట్ల రూపాయల పెట్టుబడితో సగటున సంవత్సరానికి 1500 ఫిల్ములు భారతదేశపు వివిధ భాషలలో తీస్తున్నారు. దేశంలో 20,000 సినీమా థియేటర్లు ఉన్నాయి. ప్రొడక్షన్‌లో, డిస్ట్రిబ్యూషన్‌లో, ప్రదర్శనలో మొత్తం 3 కోట్లమంది సినీ పరిశ్రమ రంగంలో పనిచేస్తున్నారు. ఇంతే గాకుండా నేషనల్ ఫిల్ము డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు సినీమా భవిష్యత్తును తీర్చిదిద్దుతున్నారు. మహారాష్ట్ర పూనేలో ఆధునిక సాధన సదుపాయాలు కలిగిన ఫిల్ము ఇన్‌స్టిట్యూట్ అఫ్ పూనా ప్రతి సంవత్సరం వందల కొద్దీ టెక్నీషియనులకు శిక్షణను ఇస్తూంది. తమిళనాడు ఊటీలో భారతీయ ప్రభుత్వం వారి ముడిఫిల్ము తయారీ ప్లాంట్ శాయుక్తంగా నిర్వహింపబడుతూంది. ఫిల్ము ఫెస్టివల్ డైరెక్టరేటువారు జాతీయ మరియు అంతర్జాతీయ ఫిల్మోత్సవాలను మనదేశంలో నిర్వహిస్తున్నారు. ఫిల్ము ఫెడరేషన్ అఫ్ ఇండియా వారు ఫిల్ము పరిశ్రమ మంచి చెడ్డలను, బాగోగులను పరీక్షించి తగిన సహాయం రక్షణ కల్పిస్తున్నారు.

## ఏనుగు తొండంలో 40,000 కండరాలు



అమాంతం పెద్ద భారాలను ఎత్తడం, సూక్ష్మాతిసూక్ష్మమైన సూదిని నైపుణ్యంగా తీయడంవంటి పనులు చేసే ఏనుగు తొండం భాగంలో మాత్రమే 40,000 కండరాలు ఉన్నాయి. ఇది మానవుని శరీరంలో ఉండే మొత్తం కండరాలకు 70 రెట్లు.

'నీవు గొప్పపనులు చేయలేక పోవచ్చుగానీ,

# పోటీలు - ఫలితాలు

(జూలై 1989)

వ్యాసం - విజేతలు - మొదటి బహుమతి: పి.ఇ.ఎస్. పట్నాయక్, శ్రీకాకుళం; రెండవ బహుమతి: ఎ. రాములు, మహబూబాబాద్, (వరంగల్ జిల్లా); మూడవ బహుమతి: వి. అరుణలత, చెన్నూరు, (కడపజిల్లా).

క్విజ్-జవాబులు: 1. (బి) మల్బరీ ఆకులు, 2. (బి) మహారాష్ట్ర, 3. (డి) లారీ కాల్లిన్స్ మరియు డొమినిక్యు లాపెరీ, 4. (ఎ) విజ్ఞాన శాస్త్ర ప్రచారానికి, 5. (సి) గాంధీ శాంతి సంస్థాపన విషయ పరిశీలన, 6. (ఎ) శాంతాల్స్, 7. (డి) ఆకులలోగల ఆకుపచ్చని ద్రవ్యము, 8. బేరింగ్ జలసంధి మీదుగా సుమారు 53 కి.మీ. ల దూరం.

విజేతలు - రెండవ బహుమతి: పి. ఇ. ఎస్. పట్నాయక్, శ్రీకాకుళం; మూడవ బహుమతి: దశిక కృష్ణమోహన్, నరసాపురం, (ప.గో. జిల్లా).

పజిల్ - జవాబులు - అడ్డం: 1. జీవితము 3. అరుణిమ, 5. ముకకరటకావు, 7. దువరు, 8. ముమ్మరము, 10. చేతులు ళ్ళకా, 12 కనుము, 13. జాలము, 14. తిలలు, 15. రబ్బరు బంతి.

నిలువు: 1. జీతగాడు, 2. ముదుక, 3. అమరకము, 4. మనువు, 5. మురుగులు గాజులు, 6. కాకేర, 9. ముఖముమూతి, 10. చేయలతి, 11. కావముర, 12. కబురు.

విజేతలు - మొదటి బహుమతి: డి. రాజరాజేశ్వరి, విశాఖపట్నం; రెండవ బహుమతి: వి జగదీశ్, వరంగల్.

తెలివికి పరీక్ష - జవాబులు: 1. 97, 2. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము; 3. ఉల్లివాసన అంటిన పదార్థానికి కస్తూరి పరిమళం అంటదు అలాగే ప్రాకృతిక వాసన పొందిన వారికి మోక్షసుఖం దొరకదు, 4.

(మిగతా 64 వ పేజీలో)

(57 వ పేజీ తరువాయి)

లాభసాటిగా ఉంటుందని తెలుసుకోబడింది. మొట్టమొదట బీట్ పంచదార ఫాక్టరీ 1802 లో జర్మనీ సైలేషియాలో నిర్మింపబడింది.

ఈనాడు మొత్తం ప్రపంచపు చక్కెర ఉత్పాదనలో 5 కి రెండు వంతులు బీటు చక్కెర నుంచి తయారు చేయబడుతూంది. సోవియెట్ యూనియన్, యుఎస్ఎ, ఫ్రాన్స్, పోలండ్, ప. జర్మనీ, టర్కీ, ఇటలీ, రుమేనియా, జెకోస్లోవేకియా, యునైటెడ్ కింగ్‌డమ్ ముఖ్యంగా ఈ చక్కెరను ఉత్పత్తి చేస్తున్నాయి.

పోషకాంశాలను పరిశీలిస్తే బీటుదుంపలో రిబోఫ్లావిన్, ఇనుము, ఎ మరియు సి విటమినులు విస్తారంగా లభిస్తాయి. పశ్చిమ దేశాలలో సాధారణంగా బీటుదుంపని డబ్బాలలో నిల్వచేస్తారు. ఊరగాయలుగా కూడా నిలువచేస్తారు.

విశ్వాసం లోపించినప్పుడు గోరంత లే

# హిందీ, ఇంగ్లీషు రెండూ అధికార భాషగా ప్రవృద్ధిపొందాలి

వ్యత్యాసం లేక భేద మేర్పరచకుండా సమభావం కలిగి ఉండటం ప్రజాపాలిత రాజ్యపు పవిత్ర ధర్మం. స్విట్జర్లాండులో రాజ్యాంగవిధానపు 116వ నిబంధన ప్రకారం జర్మను, ఫ్రెంచి, ఇటాలియను మూడు భాషలు రాజ్యాంగ భాషలుగా నిర్ణయింపబడ్డాయి. 127 వ నిబంధన ప్రకారం దక్షి




ణాఫ్రికా రాజ్యాంగవిధానంలో ఇంగ్లీషు, ఆఫ్రికన్స్ (Afrikans) రెండు భాషలు అధికార భాషలుగా పరిగణింపబడుతున్నాయి. ఫిన్లాండ్‌లో 9 శాతం జనాభా మాత్రమే స్వీడిష్ మాట్లాడుతారు. కానీ ఫిన్నిష్ మరియు స్వీడిష్ రెండూ అధికార భాషలుగా ఉన్నాయి. కెనడాలో ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు రెంటికి సమాన గౌరవం ఇస్తున్నారు. అదే విధంగా బెల్జియంలో ఫ్లెమిష్, ఫ్రెంచ్ రెండు భాషలకు సమానస్థానం ఇవ్వబడింది. భారత యూనియన్ లో ఇంగ్లీషు, హిందీ భాషలు రెండూ అధికార భాషలుగా ప్రవృద్ధి చెందడం కన్నా వేరే మార్గం లేదు. ఇది దేశంలో అందరికీ అనుకూలంగానూ, సౌకర్యంగానూ ఉండగలదని గత 200 సంవత్సరాల చరిత్ర చాటి చెబుతూంది.

—రాజాజీ

(63 వ పేజీ తరువాయి)

శ్రీ యలమేలుమంగామనోహరా, 5. వ్యాకరణ గ్రంథము, 6. 1. మేము, మనము; 2. మీరు; 3. వారు; 4. వారు, వాళ్ళు, 7. (1) కీర్తిశేషులగు, (2) కాలమగు, (3) కాలధర్మమగు, (4) దివంగతులగు, (5) శివైక్యము పొందు.

విజేతలు - మొదటి బహుమతి: వేదుల ఇందిర, హైదరాబాద్; రెండవ బహుమతి: దశిక కృష్ణమోహన్, నరసాపురం, (ప.గో జిల్లా); మూడవ బహుమతి: వి. అరుణలత చెన్నూరు, (కడప జిల్లా)

మాటల మహిమ-జవాబులు: - 1. నెయ్యి మొదలైన వాటిని తూచునపుడు పాత్రకు సరియెత్తు రాళ్ళు (ఎ), మెట్లు (బి) ఏర్పాటు (సి); 2. సిద్ధించు (ఎ), కలుగు (బి), సమాప్తమగు (సి); 3. విలపించు (ఎ), నిద్రలో మాటలాడు (బి), అర్థం లేని మాటలాడు (సి), పలవించు (డి); 4. లేత పిందె (ఎ), తరుణి (బి); 5. వ్యాపించు (ఎ), పైకిలేచు (బి), బయలుదేరు (సి), స్వస్థతనొందు (డి); 6. దుఃఖము (ఎ) రోదనము (బి); 7. తెగువ (ఎ), సాహసము (బి), చొరవ (సి); 8. అద్దె (ఎ) జీతము (బి).

విజేతలు - రెండవ బహుమతి: వి జగదీశ్, వరంగల్.

మీరైతే...? - రెండవ బహుమతి కోరాడ దుర్గారావు, పెంటనాగుల వలస (శ్రీకాకుళం జిల్లా).

"ఏపని చేయవలసినవారు ఆపని చేయుట సంఘమునకు శ్రేయస్సు."

# విస్డమ్

తెలుగు మాస పత్రికకు
అన్ని గ్రామాలలోనూ, పట్టణాలలోనూ
సమర్థవంతులైన ఏజంట్లు కావాలి!

ఏజన్సీ వివరాలకు
వెంటనే వ్రాయండి.

సర్క్యులేషన్ మేనేజర్
విస్డమ్
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు - 600004.

EDITED, PRINTED AND PUBLISHED BY K. V. GOVINDA RAO
AT No 9. DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd. Madras-14 (Ph :*

